




# వేదములు

విచారణ

## నృసింహ వాజపేయ భాష్య సహితం





## సదాశివ సమారంభాం


గురు దక్షిణామూర్తి


గురు వేదవ్యాస మహర్షి


గురు శుక మహర్షి


గురు నారద మహర్షి


గురు వాల్మీకి మహర్షి


గురు శ్రీకృష్ణ

## శంకరాచార్య మధ్యమాం


గురు దత్తాత్రేయ


గురు బాబాజీ


గురు గౌతమ బుద్ధ


గురు ఆదిశంకరాచార్య


గురు రామానుజాచార్యులు


గురు జ్ఞానేశ్వర్


గురు రవిదాస్


గురు కబీర్ దాస్


గురు చైతన్య మహా ప్రభువు


గురు నానక్


గురు రాఘవేంద్ర స్వామి


గురు వీరబ్రహ్మేంద్ర స్వామి


యోగి వేమన

## అస్మదాచార్య పర్యంతాం


గురు త్రైలింగ స్వామి


గురు లాహిరి మహాశయ


గురు రామకృష్ణ పరమహంస, అమ్మ శారదాదేవి


గురు వివేకానంద


గురు సాయి బాబా


గురు అరబిందో


గురు రమణ మహర్షి


గురు యోగానంద


గురు భక్తివేదాంత ప్రభుపాద


గురు మళయాళస్వామి


గురు విద్యాప్రకాశానందగిరి


గురు చంద్రశేఖర పరమాచార్య

## వందే గురుపరంపరాం..




భారత ప్రభుత్వపు వెబ్ సైట్ - డిజిటల్ లైబ్రరీ అఫ్ ఇండియా

http://www.new.dli.ernet.in

Digital Library of India: Inc

www.new.dli.ernet.in

# Digital Library of India

Hosted by: Indian Institute of Science, Bangalore in co-operation with CMU, IIIT-H, NSF, ERNET and MCIT for the Govt. of India and 21 major participating centres.

Home | Vision | Mission | Goals | Benefits | Content Selection | Current Status | People | Funding | Copyright Policy | FAQ | RFP

Books Journals Newspapers Palm-Leaves (Manuscripts)

Title: Ramayanam
Author:
Year: to
Subject: Any Subject
Language: Telugu
Scanning Centre: Any Centre

Clear Search

Presentations and Report
Statistics Report
Status Report
Feedback | Suggestions | Problems | Missing links or Books

Click here for PDF collection
DLI MIRROR at IUCAA Data Center PUNE

DLI

For the first time in history, the Digital Library of India is digitizing all the significant works of Mankind.

Click Here to know More about DLI New!

| Books | Journals | Newspapers | Manuscripts |
|---|---|---|---|
| Rashtrapati Bhavan<br>CMU-Books<br>Sanskrit<br>TTD,Tirupathi<br>Kerala Sahitya Akademi | INSA | Times of India<br>Indian Express<br>The Hindu<br>Deccan Herald<br>Eenadu<br>Vaartha | Tamil Heritage Foundation<br>AnnaUniversity NEW! |

Title Beginning with.

A B C D E F G H I J K L M N O P Q R S T U V W X Y Z

Author's Last Name

A B C D E F G H I J K L M N O P Q R S T U V W X Y Z

Year

| 1850-1900 | 1901-1910 | 1911-1920 | 1921-1930 | 1931-1940 | 1941-1950 | 1951- |
|---|---|---|---|---|---|---|

Subject

| Astrophysics | Biology | Chemistry | Education | Law | Mathematics | Mythology | Religion | For more subjects... |
|---|---|---|---|---|---|---|---|---|

Language

| Sanskrit | English | Bengali | Hindi | Kannada | Marathi | Tamil | Telugu | Urdu |
|---|---|---|---|---|---|---|---|---|

# అతి విశిష్టం ఈ దానం!

స్వామి వివేకానంద

"దానాలలోకెల్లా ఆధ్యాత్మిక విద్యాదానం చాలా శ్రేష్ఠమైంది! దాని తరువాతిది లౌకిక జ్ఞానదానం, ప్రాణదానం, అన్నదానం" అని వ్యాసమహర్షి చెప్పారు.

మన ఆధ్యాత్మిక జ్ఞానం భారతదేశ హద్దులలో నిలిచి పోకూడదు. లోకమంతటినీ ఆవరించాలి! ఇలా లోకవ్యాప్తమైన ధర్మప్రచారాన్ని మన పూర్వులు చేశారు. హైందవ వేదాంతం ఎన్నడూ ఈ దేశం దాటి పోలేదని చెప్పేవారూ, మతప్రచారార్థం తొలిసారిగా, పరదేశాలకు వెళ్ళిన సన్యాసిని నేనే అని చెప్పేవారూ, తమ జాతిచరిత్ర నెరుగని వారే! ఇలాంటి సంఘటనలు ఎన్నోసార్లు జరిగాయి. అవసరమైనప్పుడల్లా, భారతీయ ఆధ్యాత్మిక జ్ఞానప్రవాహం వెల్లువలా లోకాన్ని ముంచెత్తుతూ వచ్చింది.

రాజకీయ ప్రచారాన్ని రణగొణధ్వనులతో, యోధులతో సాగించవచ్చు. అగ్నిని కురిపించి, కత్తిని ఝళిపించి, లౌకిక జ్ఞానాన్నీ, సంఘనిర్మాణ విజ్ఞానాన్నీ విరివిగా ప్రచారం చేయవచ్చు. కానీ ఆధ్యాత్మిక జ్ఞానదానం కళ్ళకు కనిపించకుండా, చెవులకు వినిపించకుండా కురుస్తూ, రోజా పువ్వుల రాసుల్ని వికసింపజేసే మంచులాగా నిశ్శబ్దంగా జరగవలసి ఉంది. భారతదేశం నిరాడంబరంగా, లోకానికి మళ్ళీ మళ్ళీ చేస్తూ వచ్చిన దానమిదే!



మిత్రులారా! నేను అవలంబించే విధానాన్ని తెలియజేస్తాను వినండి. భారతదేశంలోనూ, ఇతర దేశాల్లోనూ మన పారమార్థిక ధర్మాలను బోధించడానికి తగినవారుగా మన యువకుల్ని తయారు చేయడానికై భారతదేశంలో కొన్ని సంస్థలను నెలకొల్పాలి! ఇప్పుడు మనకు కావలసింది బలిష్ఠులు, జవసంపన్నులు, ఋజువర్తనులు, ఆత్మ విశ్వాసపరులు అయిన యువకులు. అలాంటి వారు నూరుమంది దొరికినా, ప్రపంచం పూర్తిగా పరివర్తన చెందగలుగుతుంది!!

ఇచ్ఛాశక్తి తక్కిన శక్తులన్నిటి కన్నా బలవత్తరమైంది. అది సాక్షాత్తూ భగవంతుని దగ్గరి నుండి వచ్చేదే కాబట్టి దాని ముందు తక్కినదంతా లొంగిపోవలసిందే. నిర్మలం, బలిష్ఠం అయిన 'ఇచ్ఛ' (సంకల్పం) సర్వశక్తిమంతమైంది. దానిలో మీకు విశ్వాసం లేదా? ఉంటే మీ మతంలోని మహోన్నత ధర్మాలను ప్రపంచానికి బోధించడానికై కంకణం కట్టుకోండి. ప్రపంచం ఆ ధర్మాల కోసమై ఎదురుచూస్తోంది. అనేక శతాబ్దాలుగా ప్రజలకు క్షుద్రసిద్ధాంతాలు నేర్పడం జరిగింది. వారు వ్యర్థులని ప్రపంచమంతటా బోధలు జరిగాయి. ఎన్నో శతాబ్దాల నుండి వారు ఈ బోధనల వల్ల భయభ్రాంతులై, పశుప్రాయులైపోతున్నారు. తాము ఆత్మస్వరూపులమనే మాటను వినడానికైనా వారెన్నడూ నోచుకోలేదు. "నీచాతినీచుడిలో కూడా ఆత్మ ఉంది. అది అమృతం, పరమ పవిత్రం, సర్వశక్తిమంతం, సర్వవ్యాపకమైనది" అని వారికి ఆత్మను గురించి చెప్పండి. వారికి ఆత్మవిశ్వాసాన్ని ప్రసాదించండి. ❖

మూలం: శ్రీ రామకృష్ణ ప్రభ - ఫిబ్రవరి 2014

శ్రీ జ్వాల సాలగ్రామ వీర యోగానంద లక్ష్మీ నృసింహస్వామినే నమః

## శ్రీ వైఖానస స్మార్త సూత్రమ్

# శ్రీ నృసింహ వాజపేయ భాష్య సహితమ్

[షష్ఠ ప్రశ్న ప్రభృతి ఏకాదశ ప్రశ్నాత్మకోఽయం ద్వితీయో భాగః]



పరిష్కర్తా

"వైయాకరణ పంచానన" భారత రాష్ట్రపతి అవార్డు గ్రహీతా

శ్రీమాన్ రొంపిచర్ల పార్థసారథి భట్టాచార్యః

ప్రచురణ :

శ్రీ వైఖానస మహామండలిః

విజయవాటికా

ప్రభవ, శ్రావణి

9-8-1987

మూల్యమ్ :

రు. 25-00

శ్రీ జ్వాల సాళగ్రామ వీరయోగానంద
లక్ష్మీనృసింహస్వామి, వేదాద్రి



శ్లో॥ యోగపట్టసమాసీనం జానున్యస్తకరద్వయం
శంఖచక్రధరం దేవం యోగానందముపాస్మహే ॥



శ్రీమాన్ రొంపిచర్ల పార్ధసారథి భట్టాచార్యులవారు

శ్రీ లక్ష్మీ నృసింహాయ నమః

# నివేదనము

శ్రీ వైఖానస నిగమాగమ శాస్త్ర సారస్వతాన్ని భావితరాలవారికి అందించాలనే సదాశయపథంలో ప్రయాణిస్తున్న విజయవాడ శ్రీవైఖానస మహామండలి ఇప్పుడు మరో అడుగు ముందుకు వేసింది. తత్ఫలితంగా "శ్రీ నృసింహవాజపేయ కృత భాష్య సహిత శ్రీ వైఖానస కల్పసూత్ర ద్వితీయ భాగం" వెలుగు చూచింది. భాష్య గ్రంథ ప్రచురణ మహా యజ్ఞంలో మాకు సర్వదా సహకరించిన సుప్రసిద్ధాగమ పండితప్రకాండు లకు, ఆర్థికంగా ఇతోధిక సహాయము నందించిన సంఘీయులకు ముందుగ మా శత సహస్ర వందనాలు.

శ్రీ వైఖానస మహామండలి భూత పూర్వాధ్యక్షులు కీ॥ శే॥ శ్రీమాన్ డాక్టర్ దీవి శ్రీనివాసాచార్యులుగారి 81వ జన్మదినోత్సవ స్మృతి చిహ్నముగ ది 29-11-1984న శ్రీ వైఖానస కల్పసూత్ర భాష్య ప్రథమ భాగాన్ని ద్వారకా తిరుపతిలోని శ్రీ వేంకటేశ్వర ఆగమ పాఠ శాల సంస్కృత పండితులు, అష్టావధాని, శ్రీమాన్ రొంపిచర్ల శ్రీనివాసా చార్యులుగారు ఆవిష్కరించారు. తదాది సూత్రభాష్యం ద్వితీయభాగాన్ని కూడ ముద్రించాలని నిరంతరం కృషి చేశాము. ఆ కృషి నేటికి గ్రంథ రూపమున దర్శనమిచ్చినది.

వైయాకరణ పంచానన, భారత రాష్ట్రపతి గ్రహీత కీ॥ శే॥ శ్రీమాన్ రొంపిచర్ల పార్థసారధి భట్టాచార్యులవారు సంకల్పించిన భాష్య ముద్రణమును నేటికి సంఘీయుల సహాయ సహకారములతో పూర్తి గావించగల్గినందులకు మిక్కిలి సంతసించుచున్నాము.

కేవల భాష్య రూపముగ నున్న కృతికి విఖనస సూత్రమును జోడించి, సాధు ప్రతిని సిద్ధపరచుటతోపాటు కఠిన సంస్కృత పదములకు అవసరమగు తావులలో అధస్సూచికలను ఏర్పరచియు, తెలుగులో అర్థములు పొందుపరచియు, భాష్యగ్రంథ ముద్రణలోని వ్యయప్రయాసలను చిరునవ్వుతో స్వీకరించి, సంఘీయులకు మన కల్పసూత్ర విశిష్టతను చూపవలెననెడి తలంపుతో అహర్నిశలు కృషిసల్పి, పాఠకలోకమునకు మహోపకార మొనరింప ప్రయత్నించిన కొంకేపూడి వా॥ లు శ్రీమాన్ అగ్నిహోత్రం శ్రీనివాసాచార్యులుగారికి మా నమస్సుమాంజలులు.

భాష్య గ్రంథ ముద్రణకు వలయు ఆర్థిక పుష్టిని సకాలంలో సమకూర్చుటకు సహకరించిన తిరుమల దివ్య సిద్ధాంత వివర్ధినీ సభా పాలకవర్గానికి, కార్యదర్శి శ్రీమాన్ దీవి విఖనసాచార్యులవారికీ; కర్ణాటక రాష్ట్రంలోని వైఖానస సంఘీయులకు, వారినుండి విరాళాలు సేకరించిన బెంగుళూరు వాస్తవ్యులు శ్రీమాన్ వేదాంతం శ్రీరామాచార్యులవారికి, ఉభయగోదావరి జిల్లాల్లోని సంఘీయుల ను త్తేజపరచి ద్రవ్యసహాయాన్ని అందించిన కోరుకొండ వాస్తవ్యులు శ్రీమాన్ డా॥ పెద్దింటి సీతారామ భార్గవగారికి, కృష్ణా, గుంటూరు జిల్లాల్లోని సంఘీయులను ప్రోత్సహించి విరాళాలను సేకరించి యిచ్చిన శ్రీమాన్ అగ్నిహోత్రం శ్రీనివాసాచార్యులు గారికి, శ్రీమాన్ వేదాంతం రామకృష్ణమాచార్యులు గారికి, డాక్టర్ దీవి కోదండరామాచార్యులు (వణుకూరు) వారికి మా హృదయ పూర్వక కృతజ్ఞతాభివందనాలు.

శ్రీ వైఖానస కల్పసూత్ర భాష్యానికి సంబంధించిన విషయాలను గూర్చి సంఘీయులకు విస్తృత ప్రచారము చేయుచు, వారికి గ్రంథము నందాదరాభిమానములు కల్గునట్లు చేయుటలో విశేష కృషిసల్పి కృతకృత్యులైన శ్రీమాన్ వేదాంతం కేశవాచార్యులు వారికి మా ప్రత్యేక నమస్సుమనస్సులు.

భాష్యగ్రంథ ప్రథమ భాగాన్ని గుంటూరుజిల్లాలోని సంఘీయులకు అందించుటలో సహకరించిన నల్లూరు శ్రీ భగవచ్ఛాస్త్ర గ్రంథమాలాధి కారులు శ్రీమాన్ దీవి కృష్ణస్వామి అయ్యంగార్ సోదరులకు మా కృతజ్ఞతాభినందనాలు.

శ్రీ వైఖానస సూత్రభాష్య ద్వితీయభాగానికి తమ అమూల్యమైన అభిప్రాయాలను అందించిన పండిత మండనులు శ్రీమాన్ దీవి వేంకట నరసింహాచార్యుల వారికి, శ్రీమాన్ అత్తిలి గోపాలకృష్ణమాచార్యులు గారికి, శ్రీమాన్ వేదాంతం అనంత పద్మనాభాచార్యులుగారికి, శ్రీమాన్ అగ్నిహోత్రం యోగానందనరసింహాచార్యులుగారికి మా నమోవాకములు.

1931 సం॥ర ప్రజోత్పత్తి సంవత్సరాది సంచికలో ప్రచురించిన "కల్పసూత్రములు" అను వ్యాసమున శ్రీ దై. కోటీశ్వర దీక్షితులుగారు వైఖానస కల్పసూత్రమును గూర్చి వ్రాసిన విషయములను యథా తథముగ యిందు ముద్రించుకొనుటకు అనుజ్ఞ ఇచ్చిన ఆంధ్ర పత్రికాధిపతులకు మా హృదయపూర్వక కృతజ్ఞతలు.

కొంకేపూడి వా॥లు పండిత శ్రీమాన్ అగ్నిహోత్రం శ్రీనివాసాచార్యులుగారు వ్రాసిన "శ్రీ వైఖానస కల్పసూత్రము - విశిష్టత'' అను విశ్లేషణాత్మక వ్యాసమును తిరుమలలోని దివ్య సిద్ధాంత వివర్ధినీ సభవారు వారి రజతోత్సవ సంచికలో ప్రచురించిరి. ఆ వ్యాసము పాఠకలోకమున మిక్కిలి మన్నన పొందుటవలనను, ఆ వ్యాసము యీ గ్రంథ విషయమునకు సంబంధించిన అంశములను స్పృశించి యుండుటచేతను, మరల మేము దానిని యథాతథముగ పాఠకులసౌకర్యార్థమై ముద్రించుకొనుటకు అనుజ్ఞ యిచ్చిన శ్రీనివాసాచార్యుల వారికి, దివ్య సిద్ధాంత వివర్ధినీ సభ వారికిని మా కృతజ్ఞతాంజలులు.

సంఘ సేవా కార్యక్రమములందు, విశేషించి యీ గ్రంథ ముద్రణకు మాకు సూచన లందజేసి, మాకు ఎంతగానో సహకరించి, ద్వితీయ భాగము ముద్రణ జరుగు కాలములో పరమపదించిన సంఘ సేవా పరాయణులు, శ్రీ లక్ష్మీచరణ సేవాపరాయణులు, డాక్టర్ గుడిపూడి విఖనస అప్పలాచార్యులు గారికి మా భాష్పాంజలి.

భాష్య గ్రంథమును ముద్రించుటలో తగిన సలహాలను సకాలంలో అందించిన విజయవాడ వాణీ ప్రెస్ అధినేతలు, శ్రీమాన్ అగ్నిహోత్రం రంగాచార్యులుగారికి, ముద్రణ సమయంలో ఏర్పడ్డ విద్యుత్‌కొరత వంటి ఎన్నో కష్టనష్టాలను అధిగమించి, సర్వం తానేయై నిలిచి, అనతికాలంలో గ్రంథాన్ని సర్వాంగ సుందరంగా ముద్రించి మమ్మ ఆశ్చర్యచకితులను గావించిన తాడంకి, శ్రీ నాగభూషణ ప్రింటర్స్ యజమానులు పొన్నాడ శ్రీనివాసరావుగారికి మా శుభాభివందనాలు.

ముద్రణార్హమగు శుద్ధప్రతిని సిద్ధపరచిన చిరంజీవి అగ్నిహోత్రం యోగానంద నరసింహాచార్యులుకు, ముద్రణ కాలంలో అచ్చు తప్పులు విజృంభించకుండా ప్రూఫులు సరిదిద్దుటలో విశేష శ్రమ ననుభవించి ముద్రణను సకాలంలో ముగించుటకు సహకరించిన చిరంజీవి పరాశరం రామకృష్ణ మాచార్యులకు మా శుభాశీస్సులు.

శ్రీ వైఖానస మహామండలి పాలక సభ్యుల ఆశలను, ఆశయాలను, ఆచరణ రూపంలో చూపటానికి, వైఖానస శాఖీయుల అభ్యుదయానికి అహర్నిశలు శ్రమించే మా కార్యదర్శి శ్రీమాన్ ఎం. సి. ఏ. మోహన్‌కు మా హృదయపూర్వక శుభాభినందనాలు.

మా మండలి చేస్తున్న సత్కార్యాలకు ప్రత్యక్షంగాను, పరోక్షంగాను సహకరిస్తున్న ఆంధ్రప్రదేశ్‌లోని వైఖానస సంఘాలన్నింటికీ మా కృతజ్ఞతలు.

మా మండలి గావించు కార్యక్రమములకు సదా సహకారములు అందజేస్తున్న శ్రీ వేంకటేశ్వరపురం (విజయవాడ, లబ్బీపేట) లోని శ్రీ వేంకటేశ్వరస్వామివారి దేవస్థాన పాలకవర్గమునకు మా కృతజ్ఞతా పూర్వక ధన్యవాదములు.

సహృదయి పాఠక మహాశయులు గ్రంథమున నెట్టి నెరసులు దొర్లినను మన్నించి, వానిని సూచించిన యెడల మలి ముద్రణలో సవరింప యత్నింతుమనియు సవినయముగ మనవి చేయుచున్నాము.

ఇప్పటికే ఎన్నియో కల్పసూత్రములు కాలగతిలో కనుమరుగై పోయినవి. కాని, మన వైఖానస కల్పసూత్రమునకు - నృసింహ వాజపేయి కృత భాష్యమునకు మాత్రము అట్టి దుస్థితి కలుగకుండ జాగ్రత్త పడుటలో సర్వదా, సర్వథా సహకరించిన పండిత ప్రకాండులకు, మన వైఖానస శాఖీయులకు శిరసు వంచి పాదాభివందనం చేస్తున్నాం—

విజయవాడ
ప్రభవ శ్రావణ పూర్ణిమ
1987 ఆగస్టు 9

ఇట్లు
శ్రీ వైఖానస మహామండలి
రిజిష్టరు నెం. 234/84

వైఖానసార్య దివ్యాజ్ఞా వర్ధతా మభివర్ధతాం

శ్రీ లక్ష్మీ నృసింహాయ నమః

# సంస్కారం

నారాయణః పితాయస్య యస్య మాతా హరిప్రియా
భృగ్వాది మునయ శ్శిష్యా స్తస్మై శ్రీ విఖనసే నమః

చదువు - సంస్కారం అనే మాటలని మనం అందరం నిత్యం వాడుతూనే వుంటాం. వింటూనే వుంటాం. కాని ఆ పదాల అర్థాలని గురించి మనం ఎవ్వరం అంత లోతుగా విచారించం. భారతీయ జీవన సంస్కృతికి చదువు - సంస్కారం అనేవి రెండూ రెండు కళ్లు. మానవాళి మనుగడకు - నాగరికతకు ఆ రెండూ ఊతకోలలు పట్టుకొమ్మలు.

"చదువని వాడజ్ఞుండగు । చదివిన సద సద్వివేక చతురత గల్గున్" అని పోతన మహాకవి ఆంధ్ర మహా భాగవతంలో హిరణ్యకశిపుని వాక్ ద్వారమున పలికించిన మాటలు నిజంగా ముత్యాల మూటలు. చదువు మనిషిలోని సభ్యతను మేల్కొల్పుతుంది. చదువు మనిషిలో నిద్రాణంగా వున్న వినయ వీణలను మీటుతుంది. మనిషిని మనీషిగా మలచగల అయస్కాంతమే చదువు. మంచి-చెడ్డలను నిష్పాక్షికంగా బేరీజు వేయగల చతురతను నేర్పేదే చదువు. అదే మనిషి మనీషకు మొదటిమెట్టు.

మంత్రద్రష్టలు - త్రికాలవేదులునైన మహర్షులు మనిషి నిర్మలత్వానికి-పవిత్రతకు ప్రతిపాదించిన కర్మలే సంస్కారాలు. మానవుడు తన నిర్మల జీవన విధానం ద్వారా మహోన్నత నాగరికతా శిఖరాలను అధిరోహించటానికి సంస్కారం ప్రథమ సోపానం. మనిషి మనసులోని మచ్చలను - శారీరక మలినాలను సమంత్రక సంస్కారం కడిగివేస్తుంది. మాతృ గర్భవాసం నుండే మనకు సాంక్రామికంగా వచ్చిన బైజిక, గార్భిక దోషాలను అంతమొందించటానికి నిర్దేశింపబడిన ఆచరణయోగ్య కర్మలనే సంస్కారాలన్నారు మహర్షులు. ఈ సంస్కారాలు మనిషి మానసిక - శారీరక నైర్మల్యాన్ని, పవిత్రతను ప్రసాదిస్తాయి.

శ్రియఃపతి చింతనద్వారా మనిషి మోక్షానంద సౌధాన్ని చేరటానికి, అందలి అనంతుని అచ్యుతుని, అవ్యయుని దర్శించటానికి సంస్కారాలు నిరంతరం ఆలంబనాలు. ఏ ఏ సమయాలలో యెలాంటి కర్మల నాచరించటం వల్ల యే విధమైన మేళ్ళు మనకు ఒనగూడతాయో ప్రత్యక్షంగా వివరించేవే సంస్కారాలు. మంత్రపూర్వక సంస్కారాలు మనిషికి మహోపకారాన్ని అందిస్తాయని స్మృతులు నొక్కి వక్కాణిస్తున్నాయి. సర్వ మానవాళికి పవిత్రతను, సుఖ శాంతులను ఏర్పరిచే కర్మలనే మన మహర్షులు సంస్కారాలని సంభావించారు.

చదువు - సంస్కారం కలిసి ప్రతి మనిషి హృదయంలోను అధ్యాత్మ దీపాన్ని వెలిగిస్తాయి. మోక్షానంద సౌధాధినేతయైన శ్రియఃపతిని దర్శించటానికి ఆ దీపం మనిషికి దారి చూపగల్గినప్పుడే బ్రతుకులో మల్లెలు-మందారాలు వెల్లివిరుస్తాయి. అలాంటి సంస్కారాలను ఉపదేశించిన గ్రంథాలనే మనం "కల్ప సూత్రాలు" అని పిలుస్తాం. ఈ మంత్రంతో యీ పని చేయాలని సూచించే గ్రంథాలని కల్పసూత్రా లంటాము. ఈ మంత్రంతో యీ కర్మ చేయాలని సూచిస్తూ మంత్రారంభ వాక్యాలను మాత్రమే ఉదహరించటం సూత్రకారుల సంప్రదాయం.

విఖనస మహర్షి ప్రతిపాదించిన సంస్కారాలను, వాటి ఔన్నత్యాన్ని మనం సంభావించటం మేలు.

సమస్త వర్ణాశ్రమ సంస్కార ధర్మకర్మ సముచ్చయ సూత్రమే శ్రీ సూత్రం. వైఖానస సూత్రంలోని ప్రతి సంస్కారం వేదమంత్ర పునీతమైంది. సమస్త సంస్కారాలు శ్రీమన్నారాయణ పరంగా ఉపదేశింపబడ్డాయి.

"అథ నిషేకాది సంస్కారాన్ వ్యాఖ్యాస్యామః" అనుచు విఖనస మహర్షి శారీరక సంస్కారాలకు శ్రీకారం చుట్టాడు. ఆయన ఉపదేశించిన సంస్కారాలు సూత్రకర్త స్థూలంగా సంస్కారాలను నిషేక జాతక సంస్కారాలు, దహనాది మృతసంస్కారాలని రెండు రకాలుగా విభజించారు. నిషేకాది జాతక సంస్కారాలు ఇహలోక సుఖ సంధాయకాలు. దహనాది మృతసంస్కారాలు స్వర్గాది ఊర్ధ్వలోక సుఖ సాధకాలు. నిషేకాది సంస్కారాలు జీవికి కలుగబోవు. కల్గిన బైజిక, గార్భిక, దోష నివృత్తికారకాలు. నిషేకాది సంస్కా

రాలు మనిషిని పునీతుని చేస్తాయి. పుణ్య శరీరులకు దహనాది సంస్కారాలు చేయబడటంవల్ల మృతునకు స్వర్గం లభిస్తుంది. నిర్దోష శరీరాపహుతివల్ల అగ్నికి సంతృప్తి కల్గుతుంది. సంస్కర్తకు సకల సంపత్సమృద్ధి చేకూరుతుందని మహర్షి స్వయంగా సూచించారు.

| | |
|---|---|
| నిషేకాది - పాణిగ్రహణాంతం కల సంస్కారాల సంఖ్య | 18 |
| బ్రహ్మయజ్ఞము | 1 |
| పాకయజ్ఞములు | 7 |
| హవిర్యజ్ఞములు | 7 |
| సోమయజ్ఞములు | 7 |
| మొత్తం సంస్కారాలు | 40 |

నిషేక సంస్కారం నుండి సోమయజ్ఞాంత యజ్ఞమైన అప్తోర్యామ యజ్ఞం వరకు కల ఈ 40 సంస్కారాలను శారీరక సంస్కారాలుగనే మహర్షి పేర్కొన్నారు. సంస్కారాలను బ్రాహ్మలు - దైవికాలు అని రెండు విధాలుగ విభజించవచ్చు. మరల బ్రాహ్మ సంస్కారాలను 1) బీజక్షేత్ర సంశుద్ధికరాలు. 2) బ్రాహ్మణత్వ ప్రతిపాదకాలు. 3) శ్రోత్రియత్వ సంధాయకాలు. 4) పాపక్షయకరశాన్తి సాధకాలు. అని నాలుగు అవాంతర భాగాలుగ వేరుచేయవచ్చు. దైవిక సంస్కారాలన్నింటినీ భగవద్యజన విధిరూప ప్రతిపాదకాలుగ సంభావించవచ్చు.

నిషేక, ఋతు సంగమన, గర్భాధాన, పుంసవన, సీమంత, విష్ణుబలి సంస్కారాలు ఆరు బీజక్షేత్ర సంశుద్ధికరాలు. జాతకర్మ, ఉత్థాన, నామకరణ, అన్నప్రాశన, ప్రవాసాగమన, పిండవర్ధన, చౌళక, ఉపనయన సంస్కారాలు మనిషికి బ్రాహ్మణత్వ ప్రతిపాదకాలు.

పారాయణ వ్రతబంధ విసర్గ, ఉపాకర్మ, సమావర్తన, పాణిగ్రహణ సంస్కారాలు మానవునకు శుచిత్వ శ్రోత్రియత్వ సంధాయకాలు.

బ్రహ్మయజ్ఞ, పాకయజ్ఞ, హవిర్యజ్ఞ, సోమయజ్ఞ సముచ్చయాలైన 22 యజ్ఞాలు నిత్యకృత్యంలో మానవునికి అజ్ఞానంవల్ల సంప్రాప్తమైన పాప కర్మ ఫలాలను, దోషాలను పోగొట్టి ఇహ పరలోక సుఖ శాంతులను ప్రసాదించే సాధనాలు. యజ్ఞాదులు కర్తలకేకాక లోక కల్యాణ హేత్వాపాదకాలు అయినవి కూడ చాల ఉన్నవి.

విష్ణ్వర్చన ప్రతిష్ఠాదులన్నియు దైవిక సంస్కారాలు. మానవుడు సాయుజ్య మోక్షము నందుటకు విష్ణ్వర్చనము సులభ సాధనము శుభప్రదము కూడ.

వీనితోపాటుగ క్షత్రియ వైశ్య శూద్రులు ఆచరింపవలసిన సంస్కారాలను ధర్మాలనుకూడ మహర్షి సూచించారు. శారీరక సంస్కారాలలో నిషేకము ఆద్యమైంది-అద్భుతమైంది. అత్యంత విశిష్టమైంది- విలక్షణమైంది. మహిమోపేతమైంది. అన్యసూత్రకారు లెవ్వరిచే సూచింపబడనిది - నిర్వచింపబడనిది. మన్వాది స్మృతికర్తలచే ప్రముఖముగ ప్రశంసింపబడినది. సమంత్రక నిషేక సంస్కార మహిమనెరింగిన మనువు తన మనుస్మృతిలో నిషేకాది-శ్మశానాంతం సమంత్రక సంస్కార పునీతులైనవారు మాత్రమే తన ధర్మశాస్త్రిమును పఠించుటకు అర్హులు. యోగ్యులనని కంఠోక్తిగ పల్కినాడు. అట్టి మహిమాన్విత నిషేక సంస్కార విభవము ననుభవించు యోగ్యత ఒక్క విఖనస సూత్రానుయాయులైన వైఖానసులకే దక్కుట వారి పురాకృత సుకృత విశేష ఫలముగదా!

ఋతుసంగమన సంస్కారాన్నే నిషేకముగ కొందరు సూత్రకారులు సంభావించారు. కాని అది వారి భ్రాంతి మాత్రమే. విఖనస మహర్షి నిషేకాన్ని విశిష్ట సంస్కారంగానే పేర్కొన్నారు. లేకపోతే అష్టాదశ సంస్కారాలనే సూత్రకాకారుని వచనానికే విఘాతం కల్గుతుందని, భాష్యకర్తయైన నృసింహ వాజపేయయాజులవారు సూత్రకర్త హృదయాంతర్గతభావాన్ని ఆవిష్కరించారు.

భార్యాభర్తలిరువురు దర్శన స్పర్శన ప్రేక్షణాదుల ననుభవించిన పిదప ఉభయులు అనురాగ తరంగితులగుట సహజము. దంపతుల పరస్పరానురాగమే భావి శిశు బీజమునకు మూలము శుక్ర-శోణిత సమ్మేళనమే బీజరూపముగ

నవతరించునుగదా! ఈ దశలో దంపతుల పురాకృత దుష్కృతాదుల వలన శిశువునకు సంక్రమించబోవు బీజసంబంధ దోషాలను పోగొట్టుకొనుట పుట్టబోవు శిశువునకు, అందున బీజరూపముగ స్థిరపడనున్న మాంసపుముద్దకు సాధ్యము కాదుగదా! అట్టి దైహిక దోష నివారణమునకు తలిదండ్రులు ఋత్విక్కులచేతను చేయబడు హోమపూర్వక మంత్ర సంస్కారమునే నిషేకమందురు. ఇది చాల సూక్ష్మాతి సూక్ష్మమైన సునిశిత సంస్కారము. మరియు విష్ణుబలి సంస్కారము కూడ అనితర సాధారణ గర్భవైష్ణవ సంస్కార విశేషము. విష్ణుబలి సంస్కారంలో గర్భచక్రాంకనము అత్తరి మాతృమూర్తికి చేయబడు శ్రీమన్నారాయణాష్టాక్షరీ మంత్రోపదేశము విశేషమైనది. దీనిచే గర్భమునకు, గర్భస్థ శిశువునకు వైష్ణవత్వము సిద్ధించును. ఇది లేకున్న వైఖానసులకు పరమ దుర్లభమైన, పరమపద సాయుజ్య మోక్ష సామ్రాజ్య ప్రతిపాదకమైన, వైష్ణవత్వ సిద్ధి లభించదు. వైఖానసులకిది విశిష్టమైన గర్భవైష్ణవ సంస్కారము.

మానవుడు తన అజ్ఞానంవల్ల ఎన్నో అకృత్యములను చేసి పిదప తన దుష్కృత్యములకు పశ్చాత్తాపము నొంది తన్నిష్కృతికై ప్రాయశ్చిత్తములను శాస్త్రీయమైనవాటిని ఆచరించి పునీతుడు కావచ్చునని మహర్షి తలంచియే సంస్కార విహీనతలకు అన్నింటికి తగిన ప్రాయశ్చిత్తములను కూడ సూచించినారు. శాఖీయులందరు తత్తత్సంస్కారాల నాచరించి పునీతులుకాగలరని, కావలయునని ఆశించుచున్నాను. ఇంతకన్న మనకు ఉత్తమ కార్యము మరొకటి ఉండనేరదని-సంఘీయులు గ్రహింతురని ఆశించుచున్నాను.

సూత్రకారులు సూచించిన మంత్రాలను అదేవరుసలో పూర్తిగ వ్రాసి పఠించుచున్నవియే "మంత్ర ప్రశ్నలు" నారాయణ అష్టాక్షరీ మంత్ర ప్రతీకగా 8 ప్రశ్నలను సూత్రకారులైన విఖనస మహర్షి రచించారు. మంత్ర ప్రశ్నలు వైఖానస సూత్రానుసారము ఉండవలసిన విధి యున్నది. సూత్రంలోని 5 ప్రశ్న, 4 ఖండలోని "బ్రహ్మమేధ" మంత్రములు మొదటి ప్రచురణలో 4 ప్రశ్నలో కానరావు. ద్వితీయ ప్రచురణలో నిబంధన గ్రంథకారులు ఏవియో కొన్ని మంత్రములను చేర్చిరి. కాని అవి సూత్రానుసారముగ లేవు. వానిలో కూడ మంత్రవాక్యములు విడదీసి రెండు రెండుగ వేసిరి. భాష్యానుసారము పరిశీలింప "మంత్రావృత్త్యా" అని వుండుటచే అవి అసమంజసములని అర్థమగు

చున్నది. ఆ మంత్రములు ఏ వేదభాగమో చూచి సరిచేయవలయునన్న మాకు సాధ్యముకాలేదు. కావున మంత్రభాష్యం ప్రచురించే సమయంలోనైనా విజ్ఞులు వానిని సరిచేసిన మా వంటివారికి తెలుసు కొనుటకు వీలగునని ఆశ. సర్వత్ర భాష్యము సూత్రము ననుసరించియుండవలెను. కావున అట్టి మర్యాదను పాటించి శ్రీ వాసుదేవ భట్టాచార్యులవారిచే పరిష్కరింపబడి 1914 సం॥లో కుంభకోణం వారు గ్రంథాక్షరి లిపిలో ప్రకటించిన పాఠమునే గ్రహించితిమి గాన పాఠాంతరముల నిందు పొందుపరచలేదు. చదువరులిందలి ప్రమాదపర స్ఖాలిత్యాలను తెలియపరచిన యెడల ముదముతో స్వీకరించి పలి ముద్రణయందు సంస్కరించగలమని సవినయముగ విన్నవించుచున్నాను.

శ్లో॥ శ్రుతి స్మృతి నదీ పూర్ణం శాస్త్ర కల్లోల సంకులం।
విష్ణు భక్త్యుదకం శుద్ధం వందే శ్రీ విఖనోర్ణవం॥

బుధజనవిధేయ

(సం॥) వేదాంతం అనంత పద్మనాభాచార్యులు

లక్ష్మీ హయగ్రీవ మందిరం

ఈడేపల్లి - మచిలీపట్టణము

# శ్రీ వైఖానస కల్ప సూత్రము - విశిష్టత

అగ్నిహోత్రం శ్రీనివాసాచార్యులు
ఆగమిక ప్రవర : ఆయుర్వేద వైద్య విద్వాన్ - కొంకేపూడి, కృష్ణాజిల్లా

భరతభూమి కర్మభూమి. కర్మభూమి కాధారభూతము ధర్మము. ధర్మకర్మములు రెండింటికి విహారణ స్థలములు వేదములు. వేదములు మంత్రబ్రాహ్మణ సమ్మిశ్రితములు. వేదములోని మంత్రార్థ వినియోగములను బ్రాహ్మణముల ద్వారా తెలుసుకొనుట సంప్రదాయము. రాను రాను వేదవేత్తలకే యీ సంప్రదాయము తెరుంగుట కష్టమనిపించినది. అప్పుడు మహర్షు లీ యనంత వేదరాశిని మథించి దానిలోని దైవిక - శారీరక కర్మల స్వరూపములను ప్రయోగ విధానములను సులభగ్రాహ్య పద్ధతిలో వివరించుచు గ్రంథములను వ్రాసిరి. సమకాలీన సమాజమున కర్థమగు పద్ధతిలో వివరించుచు విషయములను తెల్పుచు మహర్షులచే వ్రాయబడిన గ్రంథములకే కల్పసూత్రములని పేరు. అట్టి వానిలో "శ్రీమద్వైఖానస కల్పసూత్రము" ఉత్తమమైనది. దీనిని బ్రహ్మ స్వరూపుడగు విఖనస మహర్షి రచించెను.

వేదములోని మంత్రార్థములను వాని ప్రయోగములకు విపులముగ తెల్పిన మహత్తర గ్రంథములే కల్పసూత్రములు. కర్తృకర్మ సమన్వయమునకు పరిపూర్ణ స్వరూపములే కల్పసూత్రములు.

"కౢపూ: సామర్థ్యే" అను ధాతువునుండి కల్పశబ్ద ముద్భవించినది. కల్ప శబ్దమున కనేకార్థములున్నవి. వానిలో శాస్త్రము, నిబంధనము, వేదాంగము, సంకల్పమనెడి యర్థములను యిచట గ్రహించుట యుక్తతమము. ఆనందసంహిత వ్యాఖ్యయందీ శబ్దమును వ్యాఖ్యానించుచు "కల్ప్యతే సామర్థ్య వాచినో వుత్పన్నోఽయం కల్పశబ్దః. సామర్థ్యంచేహ వేదార్థ జ్ఞాపకత్వమేవ, తాదృశ సామర్థ్య జనకం శాస్త్రం సౌలభ్య వద

చ్ఛందో బద్ధమేవ ప్రణీయమానం కల్పసూత్రం భవతి" యనిరి. వేద ములో చెప్పబడిన మంత్రార్థములను అర్థము చేసుకొని వాని వినియోగా దులను తెలుసుకొనుటనే యిచట సామర్థ్యముగ తలంపవలెను. అట్టి సామర్థ్య ప్రపూర్ణ శాస్త్రమును ఛంద స్పర్శలేని సులభ వాక్యములలో తేలికగా నర్థమును తెల్పుటకు మహర్షులు సూత్రమార్గము నెన్నుకొనిరి. వ్యాకరణవేత్తలు సూత్రలక్షణములను వివేచించుచు—

శ్లో॥ "అల్పాక్షర మసందిగ్ధం సారవద్విశ్వతో ముఖం

అస్తోక మనవద్యంచ సూత్రం సూత్రవిదో విదుః" అని పల్కిరి

(తక్కువ అక్షరముల ద్వారా విస్తృతార్థమును స్పష్టముగ తెల్పుచు, భవ్యమై దోషరహితమైన దివ్యమగు వాక్యమునే సూత్రమనిరి) మహర్షు లందరు సులభమగు సూత్రముల ద్వారా మాత్రమే విషయములు ప్రస్తా వించిరి. ఇట్టి కల్పసూత్రములు పదునెనిమిది కలవు. వానిని రచించిన మహర్షులు పదునెనిమిది మంది కలరు. వీరినే మనం సూత్రకారు లను చున్నాము.

సకల విషయములకు సంస్కారములే స్వరూపప్రతిపాదకములై యున్నవి. సంస్కారములు లేకుండ అచేతనములగు శిలాదులే రాణించ నపుడు (శిలలను అందమైన బింబములుగా రూపొందించుట) చేతనులగు మానవుల విషయములో నిక చెప్పవలసిన పని ఏమున్నది? మానవులకు సంస్కారములు ముఖ్యములని మహర్షులు భావించిరి. భూలోకమున జనించు ప్రతి ప్రాణిని బీజసంబంధమైన, గర్భసంబంధమైన, దోషములు వెంట నంటి వచ్చును అట్టి బైజిక, గార్భిక దోషనివారణమునకు మహర్షులు కర్మమార్గమే యోగ్యమైనదని తలంచిరి. దీనిచే మహర్షులు కర్మాచరణ మార్గములనే ప్రస్ఫుటముగ ప్రవచించిరి. అవియే కల్పసూత్రములుగ నవతరించినవి. అట్టివి పూర్వాపర భేదముచే 18 గలవు.

"బోధాయనీయమాప స్తంబీయం సత్యాషాఢం గార్గేయిన
మాగస్త్యం శాకల్య మాశ్వలాయినం శాంభవీయం
కాత్యాయన మితి నవాని పూర్వసూత్రాణి"

"వైఖానసీయం శౌనకీయం భారద్వాజం యాజ్ఞవల్క్యం
జైమినీయం వాధూలం మాధ్యందినం
కౌండిన్యం కౌశికీయ మితి నవాన్యపర సూత్రాణి"

బోధాయనీయాది తొమ్మిది కల్పసూత్రములు చతుర్వేదమూలక ములై శ్రౌతస్మార్త కర్మమాత్ర ప్రతిపాదకములై సామాన్య సూత్రములని పిలువబడినవి. వైఖానసాది తొమ్మిది సూత్రములు వేదోపనిషత్ప్రతిపాదకములై దైవిక - శారీరక కర్మలతోపాటు విష్ణ్వర్చనను గూడ విశిష్టముగ వ్యాఖ్యానించినందున వీని నసామాన్య సూత్రములనిరి. యజ్ఞస్వరూపుడగు విష్ణువు యొక్క పూజా విధానమును వైఖానస కల్పసూత్రం విశేషముగ చెప్పినది. ఐహికాముష్మిక ఫలముల నిచ్చు నాచారము లన్నియు, తుల్యన్యాయముగ వైఖానస శాస్త్రమందే చెప్పబడినవి. అష్టాదశ కల్పసూత్రములలోను శ్రీ వైఖానస కల్పసూత్రము స్వయం సంపూర్ణము, సర్వాంగ సుందరమని పూర్వులే నొక్కి వక్కాణించిరి.

శ్లో॥ త్రిమూర్తీనాం యథా విష్ణు శ్శివానాంతు సదాశివః
ధర్మాణాం వైష్ణవో ధర్మ స్స్మృతీనాం మానవ స్మృతిః
విప్రాణాం వేదవిదుషాం యథా వైఖానసోవరః
సూత్రాణాం తత్ప్రణీతంతు యథా శ్రేష్టతమం స్మృతం

త్రిమూర్తులలో విష్ణువు, శివులలో సదాశివుడు ధర్మములలో వైష్ణవధర్మము, స్మృతులలో మనుస్మృతి, వేదవిదులైన విప్రులలో వైఖానసులు యెట్లు శ్రేష్ఠులో అట్లే కల్పసూత్రములలో విఖనస కల్పసూత్రము శ్రేష్ఠమైనదని బ్రహ్మవైవర్త పురాణము తెల్పినది.

విఖనస మహర్షి చే విరచితమైన కల్పసూత్రమునకే శ్రీ వైఖానస కల్పసూత్రమనియు, శ్రీసూత్రమనియు, శ్రీశాస్త్రమనియు, శ్రీ వైఖానస భగవచ్ఛాస్త్రమనియు, ఔఖేయస సూత్రమనియు పేర్లు గలవు. ఈ కల్పసూత్రమునకు వివిధమైన నామములు లోకంలో ప్రచారము నందున్నవి. ఒక్కొక్క విషయమును బట్టి ఒక్కొక్క నామమేర్పడినది. ఇవి యన్నియు సార్ధక నామములుగనే నిలిచినవి.

శ్లో॥ విఖనో మునయే పూర్వం సూత్రం భగవతేరితం
తస్మాద్భగవత సూన్త్రం లోకే వైఖానసం స్మృతం

ఆది యందు శ్రీ విఖనస మహర్షికి భగవానునిచే యీ సూత్రము ఉపదేశింపబడినది గావున నిది వైఖానస సూత్రమనబడుచున్నది. మరియు బ్రహ్మశబ్ద వాచ్యుడగు విఖనస మహర్షి భగవానుని ఆదేశానుసారము గ్రహించి రచించినదగుటచే నీ సూత్రమునకు వైఖానస సూత్రమని పేరు వచ్చినది. శ్రౌతస్మార్త ధర్మరూపమగు సమస్త కర్మ విషయ ప్రతిపాదకమై, బోధాయనాది పూర్వసూత్రము లన్నింటికిని నేత్రభూతమై, వరలినదీ వైఖానస సూత్రమొక్కటియే. వేదవేదాంగములచే ప్రతిపాదింపబడిన విషయములకు కర్మలకు ప్రామాణికత్వమును కల్పించుటయేగాక భగవదర్చనా విధానమును కూడ ప్రకటించిన ఏకైక సూత్రమిదియే యగుటవలనను సర్వసూత్రముల కిది తారహారమధ్యస్థమగు మణివలె ప్రకాశించినది. అందువలననే వైఖానస సూత్రమును మహర్షులు సూత్రానుక్రమ పట్టికలో మధ్యయందు పఠించిరి. చతుర్వేద ప్రతిపాదకములగు సామాన్య సూత్రములకు, వేద వేదాంగ ప్రతిపాదకములగు అసామాన్య సూత్రములకు వైఖానస సూత్రము వారధివలె నిలిచి విష్ణ్వర్చనా విధానమును విశిష్టముగా ప్రతిపాదించింది. వైఖానస సూత్ర కాంతులు దేహళీదీపన్యాయముగ సామాన్య సూత్రములకు, అసామాన్య సూత్రములకు ప్రసరించుచున్న వనుటలో సందేహం లేదు.

"లక్ష్మీ విశిష్ట ఏకఏవ నారాయణః ప్రవర్తవ్యో నాన్యః" అను వాక్య ప్రామాణ్యముచే లక్ష్మీసహితుడగు నారాయణునే యారాధింపవలె నని ప్రతిపాదించుచు విఖనస మహర్షి సూత్రమును వ్రాయుటచే దీనికి శ్రీసూత్రమని పేరు వచ్చినది. విఖనసాచార్యులవారు తన శిష్యులగు భృగ్వత్రి మరీచి కశ్యపాదులకు సమస్తాగమ విషయములను సార్ధకోటి ప్రమాణ గ్రంథముగ చెప్పిరి. మానవుల అల్పబుద్ధిని గుర్తించిన మహర్షి శిష్యులు నల్గురు యీ విషయములనే చాతుర్లక్ష గ్రంథముగా క్లుప్తీకరించి సులభ పద్ధతిలో రచించిరి. వీరు వ్రాసిన సమస్తాగమ వాఙ్మయమునకు విఖనసాచార్యుల వారి కల్పసూత్రమే భూమికయై యున్నది. కావున యీ సూత్రమును శ్రీశాస్త్రమనియు పలువురు పండితులు ప్రశంసించుచున్నారు.

ప్రథమతః శ్రీమన్నారాయణునిచే యీ శాస్త్రము సమస్తము విఖనో మునీంద్రుల కుపదేశింపబడినది గావున దీనికి వైఖానస భగవచ్ఛాస్త్రమని పేరు వచ్చినది.

"ఉఖా స్వగ్నినాదాయ." ఛుల్యాం కపాల మారోప్య.... తమేన ముత్తపనీయం ఇత్యుదా హరన్తి" ఇత్యాది సూత్రవాక్యముల ప్రమాణముచే ఉఖాపాత్రచే సంస్కారములు చేయువారు వైఖానసులు. ఉఖాయను పేరుగల యజ్ఞపాత్రయందుత్పన్నము చేయబడిన అగ్నియే ఉఖాగ్ని యనబడును. అట్టి అగ్ని కలవారే ఔఖేయులు. వారి విధులను నిర్దిష్టముగ చెప్పినదే ఔఖేయస సూత్రము.

ఉఖాగ్ని స్వరూపము:- ప్రాతఃకాల సూర్యకిరణ స్పర్శను పొందుచున్న వల్మీకమృత్తిక, ఊక, గంధ్ర యిసుక, పెంకుల చూర్ణము, మేక, లేడి వెంట్రుకలను కలిపి, పలాశకషాయముతో నూరి ప్రాదేశ మాత్ర[1] మెత్తు, అరత్ని[2] ప్రమాణచతురస్రముగా తయారుచేసిన పాత్రనే

1 ప్రాదేశము : సుమారు 8" ఎత్తు. 2 అరత్ని: ముడిచిన పిడికిలి మూలము నుండి మోచేతి చివరవరకునుగల కొలత

ఉఖా పాత్ర యందురు. ఈ ఉఖా పా త వినియోగమును గూర్చి శ్రౌత మిట్లు తెల్పుచున్నది. నేతిలో ముంచిన గో కరీషమును యీ ఉఖాపాత్ర యందుంచి ఆ పాత్రను ఆహవనీయహోమముపైనుంచి వేడిచేయుచుండ ఆ పాత్రలోని పిడకనిప్పు కణికవలె మారిన తరువాత ముంజదర్భను ఆ అగ్నినుంచి ఉత్తపనముచేసి ఆ అగ్నిని 12 దినములు రక్షించి, దానిలో అగ్న్యాధేయ యజ్ఞము చేయవలయునని చెప్పబడినది. పైనుదహరించిన సంస్కారముల నన్నింటిని పొందిన అగ్నినే ఉఖాగ్నియని పిలిచిరి. ఇట్టి సంస్కారముతోకూడిన ఉత్తపనాగ్నియే వైఖాససునకు జాతకర్మాది శవ దహనాంతము అత్యంతావశ్యకమైనదిగా చెప్పబడుటచే ఈసూత్రము నకు ఔఖేయస సూత్రమని సార్థకనామమేర్పడినది. జాతకర్మ, అంత్యేష్టి యజ్ఞాదులయందు గూడ యీ విధముగ ఉఖాపాత్ర ప్రయోగము గలదు. దీనికే ఉఖా, శరావం, కపాలం, అని కూడా పదములను ప్రయోగించిరి,

కల్పసూత్రముల యందు సాధారణముగ గృహ్య సూత్రములు (స్మార్తము) ధర్మసూత్రములు శ్రౌతసూత్రములనెడి త్రివిధ విభాగము లుండును. శ్రౌత స్మార్త ధర్మసూత్రములు మూడును కల సూత్రమునే పరిపూర్ణ కల్పసూత్ర మందురు. శ్రీ వైఖానస కల్పసూత్రము గూడ పరిపూర్ణ కల్పసూత్రముల కోవకు చెందినదే.

గృహమనగా భార్య. గృహసంబంధమైన కర్మలు గృహ్యములు. అట్టి గృహకర్మలను ప్రబోధించునవే గృహ్యసూత్రములు. ఇవి యీ కల్పసూత్రమున 7 ప్రశ్నలలోగలవు. వీనియందు జాతకాది శ్మశానాంత కర్మలు ప్రాయశ్చిత్త సహితముగ నున్నవి. మరియు వర్ష వర్ధనము, గృహార్చాబింబ ప్రతిష్ట, అర్చన, నవగ్రహ యజ్ఞము, సప్త పాకయజ్ఞ ములు గృహ్యసూత్రములలో చెప్పబడినవి. ధర్మములు సర్వకాలముల యందు, సమస్తాశ్రమముల వారిచే సర్వదా ఆచరణీయములుగా ఉపదే శించుచుండుటయేగాక యత్యాశ్రమ స్వీకార ధర్మములు, ధర్మాచరణ విధానములు, వారి అంత్యేష్టి క్రమములు చాతుర్మాస్య వ్రతములు,

అష్టాంగ యోగములు, అనులోమ విలోమోత్పత్తి, వారి వారి వృత్తి విధానములు, వివరముగ నిందు చెప్పబడినవి. కావుననే వీనికి ధర్మ సూత్రములని పేరు వచ్చినది. ఇవి 3 ప్రశ్నలలో నున్నవి.

ప్రవరసూత్రమొక ప్రశ్నలో కలదు. ప్రవరసూత్రములో వైఖానస సూత్రానుయాయులైన వారి సప్తవిధ గోత్రములు వారి ఋషి నిర్ణయము, హౌత్ర ప్రశంసనమునందు యెట్లుచ్చరింపవలయునో వివరంగ చెప్పబడింది. కావున దీనికి ప్రవరసూత్రమని పేరు వచ్చింది. శ్రౌత సూత్రములు 21 ప్రశ్నలలో గలవు. వీనియందు శ్రుతి స్మృతి విహిత మగు యజ్ఞయాగాది కర్మకాండ విధానములు చెప్పబడినవి. హవిర్యజ్ఞములు, సోమయజ్ఞములు, విశేషయజ్ఞములు, వాని స్వరూపములు, అనుష్ఠేయ మార్గములు, సప్రాయశ్చిత్తముగ తెల్పబడినవి. అందుచే దీనికి శ్రౌతసూత్రమని పేరు వచ్చినది.

విఖనస మహర్షి అష్టాక్షరీ మహామంత్రాంతర్గత అక్షరముల నాశ్రయించి మంత్ర ప్రశ్నలను 8గ విభజించిరి. చరమ శ్లోకమును దృష్టియందుంచుకొని దానిలోని అక్షరములను జ్ఞప్తికి తెచ్చునట్లుగ కల్ప సూత్రమును 32 ప్రశ్నలుగ విభజించిరి. సమస్త వైఖానసాగమ వాఙ్మయావిర్భావమునకు యీ వైఖానస కల్పసూత్రమే భూమికయైనది, విఖనస మహర్షి శిష్యులగు భృగ్వత్రిమరీచికశ్యపులు దీనినాశ్రయించియే దైవిక భాగములను బోధించు గ్రంథరచన కుపక్రమించిరి.

శ్రీ వైఖానస కల్పసూత్ర వైశిష్ట్యమును గూర్చి యిత:పూర్వమే పలువురు పండితులు పలురకములుగ వివరించిరి. వైఖానస సూత్రము పది కారణములచే తన విశిష్టతను నిలబెట్టుకొనినదనుచు శ్రీ శ్రీనివాసమఖి శ్రీ సూత్ర భాష్యోపోద్ఘాతమున తెల్పిరి. "దశవిధహేతు నిరూపణ" మను పేర నొక గ్రంథమే వారి లేఖిని నుండి వెలువడినది.

1. అఖిల జగత్కారణం భూతేన విఖనసా ప్రణీతత్వాత్

మత్స్యావతారకాలమున బ్రహ్మదేవుని ప్రార్థన మేరకు శ్రీ మహా

విష్ణువు యజ్ఞనిర్వహణమునకు లోక ప్రీతికి, వేదపురాణ ధర్మ శాస్త్రము లకు మూలమైనదియు, సాంగోపాంగముగ నున్నదియు, పది యర్పుద ముల నిడివికలదియునగు వైఖానసమను పేరుగల వేదరాశిని రచించి, దానిని విపులముగ బ్రహ్మదేవున కుపదేశించినాడు. విఖనసబ్రహ్మ జటా కషాయ దండకమండల మండితుడై నైమిశారణ్యమును ప్రవేశించి ముని బృందపరివృతుడై విష్ణుధ్యానము చేయుచు వేదమంత్ర సహితమై బహు విస్తృతముగ నున్న వైఖానస సూత్రమును చూచి దానిలోని సారమును గ్రహించి సార్ధకోటి ప్రమాణముగా సంక్షేపించి తనశిష్యులగు మరీచ్యాది మహర్షుల కుపదేశించిరి. విఖనస బ్రహ్మచే నుపదేశింపబడిన వైఖానస సూత్రము నింకను సంక్షేపించి నాల్గు లక్షల గ్రంథముగ మరీచ్యాదులు ప్రపంచమున కందించిరి. వైఖానస శాఖయను పేరుగల వేదరాశి నుప యోగించి సకల జగత్కర్తయగు శ్రీ విఖనస బ్రహ్మచే వైఖానస సూత్రము రచింపబడుటచే విశిష్టమైనదిగ పేర్కొనబడుచున్నది.

2. సర్వసూత్రాణా మాదిమత్వాత్

సమస్త కల్పసూత్రములకు ఆద్యమైనదీ వైఖానస సూత్రము, దైవిక-శారీరక సంస్కారములను ప్రవచించిన సకలసూత్రములలో నిది మొదటిది.

శ్లో॥ వైఖానస మతతస్మిన్నాదౌ ప్రత్యక్ష దర్శనం ।
స్మర్యతే మునిభి ర్నిత్యం వైఖానస మతః పరం॥

సమస్త శాఖలకు వైఖానసమే ప్రత్యక్షమైనది. దీనిచే మునులందరును వైఖానస మతమునే నిరంతరము స్మరింతురు.

శ్లో॥ "వైష్ణవం సూత్రమే తద్ధి, సర్వసిద్ధి కరంపరం ।
ఆద్యత్వా త్సర్వ సూత్రాణాం వైష్ణవత్వాచ్చ తత్తువై
మయాను వర్తితం తద్వత్కాశ్య పాత్రి మరీచిభిః"

మొ॥ ప్రామాణికవాక్యములచే శ్రీ వైఖానస సూత్రము వైష్ణవత్వమును

ప్రతిపాదించుటయేగాక సమస్త సూత్రములకు ఇదియే ఆద్యమైనదై యున్నది. కావుననే దీనినందరు మహర్షులు ఆచరించుటకు ప్రయత్నించారు. ఈ వైఖానస సూత్రము ఐహికాముష్మిక సకల ఫలములు దీనిచే లభించుననుటచే ఇదియే సర్వసూత్రములకు మొట్టమొదటిదియగుచున్నది. ఇది వైష్ణవత్వమును బోధించుననుటచే మిగిలిన సూత్రము లేవియు వైష్ణవ ధర్మమాత్ర ప్రతిపాదకములు గావు కావుననే మరీచి కశ్యపాది మహర్షులును దీని ననుష్ఠించుచున్నారని స్కాందపురాణము వివరించింది. వేదసమిష్టి స్వరూపమగు సూత్రమునందు పరమేష్టియగు విఖనస మహర్షిచే ప్రవచింపబడిన త్రివిధార్చనలు, వైదికాచారములు, బ్రాహ్మణాది భేదములు, ఆచారములు మొ॥ వానిని మొదటిగ నిరూపించినదిదియే. కావున నిది సమస్త సూత్రాలకు మొట్టమొదటిదైనది. ఇది యొక విశిష్ట లక్షణము.

3. ప్రధానాది కర్మసు శ్రుతిమార్గాను సారిత్వాత్

శ్రీ వైఖానస సూత్ర మితర సూత్రాలవలె గాక ప్రత్యక్షముగ వేదములే మూలముగ దీసుకొని ప్రవర్తించింది. సమస్త సంస్కారములు వేదవిహితముగ నిర్వచింపబడినవి. శుద్ధాచమనమును ఆచరించు సమయాన ఋగ్వేదః ప్రీణాతు యని శ్రుత్యాచమనమును నిర్దేశించిన దీ సూత్రము. ఇతర సూత్రకారులందరు కేశవాది నామములచే స్మృత్యాచమనమును, అచ్యుతానంత గోవింద నామములచే పురాణాచమనముననే విధింపగ యీ సూత్రము శ్రుత్యాచమనము పల్కి తన విశిష్టతను చాటుకొనినది. బోధాయనుడు అర్ఘ్యప్రదానమును చెప్పలేదు. సంధ్యోపస్థానాదులకు ప్రధానమైన అర్ఘ్యప్రదానాదులను కూడ యీ సూత్రము శ్రుతివిహితముగనే పల్కినది, "వేదో నారాయణ స్సాక్షాత్స్వయంభూరితి శుశ్రుమః" అను ప్రమాణముచే వేద ధర్మం శ్రేష్ఠమైనదనియు ఆ వేదం నారాయణ స్వరూపమనియు తెలియనగును. "అగ్నిర్వై దేవనామవమో విష్ణుః పరమస్తదంతరేణ సర్వా అన్యాదేవతాః" అను శ్రుతి ననుసరించి

విష్ణువు దేవతలలో నుత్తముడని వేదము ఘోషించుచుండుటచే నట్టి వేద స్వరూపుడైన నారాయణ దేవుడే ముఖ్యునిగా ప్రతిపాదించుట చేతను శ్రుతి మార్గానుసారిత్వమునే స్వీకరించుట చేతను శ్రీ వైఖానస కల్ప సూత్రం విశిష్టమైనది.

4. సమంత్రక సర్వక్రియా వత్త్వాత్

విఖనస సూత్రం సమస్త సంస్కారాలను కర్మలను సమంత్రకముగ నిర్దేశించుట విశిష్టమైన లక్షణము. నిత్యానుష్ఠాన విధియందు "ఇంద్రోహ ముఖాభ్యాం"యని యారంభించి కర ప్రక్షాళనాదులనుగూడ సమంత్రకము గనే విధించిన దీ సూత్రం. ఇతర సూత్రకారులెవరును చెప్పనట్టి యౌపా సనాగ్నికుండ విధానమిందు స్పష్టంగ చెప్పబడింది. ఆఘార హోమ విధిలో మంత్రరహితముగ నే కర్మను మహర్షి ప్రతిపాదించలేదు. నాందీ ముఖ పూర్వకముగ ఉపనయనాది శారీరక కర్మలన్నియు సమంత్రకము గనే ప్రవచింపబడినవి. ఇతర సూత్రకారులు చెప్పని పలుతావుల యందు విఖనస మహర్షి మంత్ర నిర్ధేశము గావించినారు గాన సర్వ సూత్రోత్త మత్వ మీ సూత్రమునకు దక్కింది.

5. నిషేక సంస్కారాది మత్త్వాత్

విఖనస స్సూత్రం నిషేక సంస్కారమును ప్రథమ సంస్కారముగ ప్రవ చించింది. విఖనస సూత్రమున నిషేకాది శ్మశానాంత సంస్కారములు మంత్రపూర్వకముగ చెప్పబడినవి.

శ్లో॥ నిషేకాది శ్మశానాంతో మంత్రైర్యస్యోదితో విధిః
తస్య శాస్త్రేఽధికారోఽస్మిన్ జ్ఞేయోనాన్యస్య కస్యచిత్"

నిషేకమాదిగా గల సర్వ సంస్కారములు మంత్రసహితముగ నెవరికి చెప్పబడినవో వారు మాత్రం యీ మను ధర్మశాస్త్రము ననుసరించుట యందు అర్హులై యున్నారని సూచించుటవలనను, శ్రీ సూత్రమునందు నిషేకమాది సంస్కారముగ చెప్పబడి యుండుటచే అట్టి అధికారమును వైఖానసులే కల్గియుండుటగాక, మనువుకూడ వైఖానసుడై యీ విఖనస

సూత్రావలంబకుడగుట వలన యీ సూత్రమునకు ఇతరోధికమగు విశిష్టత ఏర్పడింది.

6. అష్టాదశ శారీర సంస్కారాత్మ కత్వాత్

ఇతర సూత్రములలో కన్పించనివియు, శ్రుతిసిద్ధమైనవియునగు అష్టాదశ సంస్కారములను విఖనస సూత్రము తెల్పినది. "నిషేకాది సంస్కారాన్ వ్యాఖ్యాస్యామః" యని యారంభించి నిషేక, ఋతు సంగమన, గర్భాధాన, పుంసవన, సీమంత, విష్ణుబలి, జాతకర్మ, ఉత్థాన, నామకరణ అన్నప్రాశన, చౌళ, ఉపనయన, పారాయణ, వ్రతబంధ విసర్గ సమావర్తన, పాణిగ్రహణములను పదునెనిమిది సంస్కారాదులను వివరించినారు. ఇవి యన్నియు శారీరక సంస్కారములు.

7. సాంగక్రియా కలాప వత్త్వాత్

విఖనస మహర్షి చెప్పిన అష్టాదశ సంస్కారములు సాంగక్రియాపూర్వకముగ నున్నవి. అనుక్తమన్యతో గ్రాహ్యమను న్యాయమున కీ సూత్రమున తావులేదు. సమస్త కర్మలకు విధి విధానములు మంత్రపూర్వకంగ చెప్పబడినవి. ఆపస్తంబ బోధాయినాది సూత్రాంతరములన్నియు న సంపూర్ణముగనే యున్నవి కాని వైఖానస సూత్రమేమాత్రము సూత్రాంతర విషయాపేక్ష లేకుండ సర్వ సంపూర్ణమై, విలసిల్లుచున్నదనుటలో సందియము లేదు. కావున నిది విశిష్ట సూత్రముగ పేర్కొనదగినది.

8. మన్వాద్యైః స్వీకృతత్వాత్

శ్లో॥ పుష్పమూల ఫలైర్వాపి కేవలైర్వర్తయేత్సదా
కాలపక్వై స్స్వయంశీర్ణైః వైఖానస మతేస్థితః

పుష్పములు, మూలములు, ఫలములు మొ॥గు వానిని కాలపక్వములై తమంతట తాము పండి రాలినవగు వానిని మాత్రమే గ్రహించి దేహయాత్ర గడుపుచునుచు వైఖానస సూత్రమందు చెప్పబడిన ధర్మముల ననుష్ఠించుచు వానప్రస్థాశ్రమమును గడుపవలయునని మనువు తెల్పెను. ఇష్టే వానప్రస్థో వైఖానస శాస్త్ర సముదాచారః యని బోధాయనుడు

"శ్రామణకేన విధానేన సాయం ప్రాతరుపస్పృశేత్" యని యముడు అపస్తంబుడు, జైమిని, శంఖ లిఖితుడు, వశిష్ఠాదులు మనువు ననుసరించియు వైఖానస సూత్రము ననుసరించియు, వానప్రస్థాది ఆశ్రమధర్మములను వివేచించిరి. దీనివల్ల వైఖానస సూత్రమునకు యెంతటి ప్రాముఖ్యమున్నదో తెలియుచున్నది.

9. అఖిల జగదేక కారణభూత, శ్రీమన్నారాయణైక పరత్వాత్॥ విఖనస సూత్రములో ప్రథమ ప్రశ్న ప్రథమ ఖండాంతమున నారాయణ పరాయణో నిర్ద్వంద్వో మునిః అనియు, ఆచమన విధియందు విష్ణుః ప్రీణాతు అని హృదయప్రదేశావాస శ్రీయుతుడగు శ్రీమన్నారాయణుని నామ ముపదేశింపబడుటయు, సన్న్యాస విధియందు "సదాధ్యాత్మ నరతో ధ్యాన యోగీ నారాయణ పరంబ్రహ్మ పశ్యన్, ధారణాం ధారయేదక్షరం పరంబ్రహ్మాప్నోతి" యనుటచే సర్వకాల సర్వావస్థలయందును అధ్యాత్మరతుడై ధ్యానయుక్తుడై పరంబ్రహ్మయగు నారాయణుని దర్శించుచు ధారణమును చేయవలెను. అతడు అక్షరమగు పరబ్రహ్మను పొందుచున్నాడు. అట్టి పరబ్రహ్మయు నారాయణుడే. సన్న్యాస విధియందు నారాయణపారమ్య ముపదేశింబడింది. పుణ్యాహ అఘారాంత హోమ నాందీ పాణిగ్రహణాది అంత్య కర్మల వరకును, అతో దేవాది వైష్ణవ మంత్రములే ప్రయోగింపబడినవి. నారాయణ పరంబ్రహ్మ, ఏకోహవై నారాయణః, నారాయణ పరాయణః, నారాయణం ధ్యాయన్, భగవంతం నారాయణ మర్చయేత్ మొ॥ వాక్యములన్నియు నారాయణ పరత్వమునే బోధించుచున్నవి. సర్వదేవ నమస్కారాః కేశవం ప్రతిగచ్ఛతి యనునట్లు సమస్తవిషయములును నారాయణపరముగనే ప్రతిపాదింపబడినవి. గావున అఖిల జగదేక కారణభూతుడగు శ్రీమన్నారాయణుడే సర్వాంతర్యామియై యుండును గావున నాతనినే ఆరాధింపవలెనని నిర్దేశించిన ఏకైక సూత్రమిదియే యగుటవలన మిక్కిలి విశిష్టమైనదిగా సంభావింపబడినది.

10 తత్సూత్రోక్త ధర్మానుష్ఠానవతామేవ భగవత్ప్రియతమత్వోపపత్తేశ్చ

మహాత్ములగు వైఖానసులు శ్రీమన్నారాయణునకు అత్యంత ప్రియతములగుచున్నారని ఛాందోగ్య బ్రాహ్మణము తెల్పుచున్నది.

శ్లో॥ "అశ్వత్థః కపిలాగావ స్తులసీ విఖనా మునిః

చత్వారో మత్ప్రియా రాజ స్తేషాం వైఖానసో వరః"

రావిచెట్టు, నల్లని గోవులు, తులసి, వైఖానసులు నను నల్వురును నాకు ప్రియమైనవారు. అందునను వైఖానసులు శ్రేష్ఠులు. అని వరాహ పురాణమున తెల్పబడింది. దీనివలన శ్రీమన్నారాయణుని ఎవరు ఆరాధింతురో (వైఖానసులు)వారు విష్ణువునకు ప్రీతిపాత్రులని దీనియర్థము. శ్రీమన్నారాయణుడే తాను శ్రీ వైఖానసులను అత్యంత ప్రియతములుగా చూచుచున్నట్లు సంకల్పించినాడు. అట్టి సూత్రానుయాయులైన వైఖానసులే భగవానుని ప్రేమకు పాత్రులగుచుండిరి. అందుచే వారి సూత్రముగూడ భగవత్ప్రీతియై యుండుట యుక్తమై యున్నది.

శ్లో॥ "మద్భక్తి యుక్తస్య మదౌరసస్య । నిషేక కర్మాది విరాజితస్య

వైఖానసస్యాస్య నతప్తముద్రా । న మంత్ర దీక్షా నగురుర్మయా వినా॥

అని శ్రీభాష్యము తెల్పు. వైఖానసాస్తు మత్పుత్రాదాసాశ్చాన్యే వరాననే" అనియు చెప్పెడి భగవద్వాక్యప్రమాణములచే నది భగవత్ప్రియతమమై యున్నది. మరియు వైఖానసులు శ్రీమన్నారాయణునకు ప్రీతిపాత్రులై యున్నారు.

11. శిఖా యజ్ఞోపవీత త్రిదండయుతమగు విశిష్టాద్వైత సన్యాసాశ్రమ స్వీకార పద్ధతులను శ్రీమన్నారాయణ పరత్వముగ విఖనసమహర్షి యొక్కరే చెప్పిరి. ఇది అన్యసూత్రముల యందెచ్చటను కానరాదు.

12. సమస్త యజ్ఞములను ఆచరించిన పిదప సర్వ పాప పరిహారార్థము, సర్వులను ఆచరింపదగిన 'మృగారేష్టి' యజ్ఞమును విపులంగా చెప్పింది విఖనస మహర్షి యొక్కరే. ఇతర సూత్రానుయాయులు కూడ దీనినే యనుష్ఠించుట నేటికిని మనము చూచుచునే యున్నాము.

13. అథాగ్నౌ నిత్య హోమాన్తే విష్ణోర్నిత్యార్చా సర్వదేవార్చా భవతి" యజ్ఞేషు విహీనం తత్సంపూర్ణం భవతి. ద్విజాతి రతంద్రితో నిత్యంగృహే దేవాయతనేవా భక్త్యా భగవంతం నారాయణ మర్చయేత్" అని విష్ణ్వర్చనమును, ప్రతిష్ఠావిధిని సూత్రప్రాయముగ చెప్పి, సార్ధ కోటి ప్రమాణగ్రంథముగ శిష్యులకు తెలుపగవారు నాల్గు లక్షల గ్రంథ ముగ విషయమును సూక్ష్మీకరించి విపులీకరించుటచే అసామాన్య సూత్ర ములలో నిది ప్రధానత్వమును బొంది 'సర్వసూత్రాణామాది మత్వాత్' అను హేతువునకు సరిపోవుచున్నది.

14. "వైష్ణవం సూత్రమే తద్ధి సర్వసిద్ధికరం పరం' అను భగ వానుని వాక్యముచే యీ వైఖానస సూత్రానుయాయులకు వైష్ణవత్వ సిద్ధికి తప్త ముద్రాదులతో పనిలేకుండ విష్ణుబల్యాది కర్మలచే వైష్ణవత్వ సిద్ధిని ప్రసాదింపజేయుటచే ఉత్కర్ష ఏర్పడినది. భగవానుడు సర్వతంత్ర స్వతంత్రుడు గనుక గర్భరక్షణార్ధమని సంకల్పించి విష్ణుబలి కర్మచేయగా 'గర్భస్థ శిశువు చక్రాంకితుడగుగాక' యని శ్రీమన్నారాయణుడు సంక ల్పించుటయే వైఖానసులకు గర్భ వైష్ణవత్వ సిద్ధి హేతువుగా ప్రతిపా దింపబడుట గొప్పదైన యుపదేశము. ప్రహ్లాదుడు యిందుకు దృష్టాంత ముగా నున్న విషయమందరికి తెలిసినదే. రామాయణములోని పుత్ర కామేష్టిలో యజ్ఞ పాయస భక్షణము నిట్టిదే.

15. విఖనస సూత్రమున కేవలం వైఖానస ధర్మములేగాక, బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్య, శూద్రులకు గూడా చేయదగు సంస్కార ములు తెల్పబడినవి. ఉపనయనకాల, దండధారణ, అజిన, మౌంజీ భేద ములు, వారి కుపదేశింపదగిన మంత్రములు మొదలగునవియు, వారి వారికి ఉత్తమమైన వివాహ భేదములు వివరముగ నుద్బోధింపబడి యుండుటవలన నీ సూత్రం సర్వులకు ధర్మమార్గాదర్శకముగా నున్నది.

16. విఖనస సూత్రము భగవత్ప్రతిష్ఠా, సందర్భమున బింబ శుద్ధికై 'అష్టకలశ స్నపనమును' విశిష్టముగా బోధించినది.

17. ఈ సూత్రము వశిష్టమగు అంశములను కొన్నింటిని ప్రతిపాదించినది. 'వర్ష వర్ధన మహోత్సవమును' అష్టాదశ సంస్కారాంతర్గతము కాకుండ విశేషముగ చెప్పినది. ఈ ఉత్సవమును ఉపనయన పర్యంతము జన్మ నక్షత్రము నందును, తదాది ఉపనయన నక్షత్రము నందును, వివాహానంతరమా నక్షత్రమునందును, యత్యాశ్రమ స్వీకారానంతరము ఆ నక్షత్రము నందును, (వర్ష వర్ధనోత్సవము) చేయుచు సహస్ర చంద్ర దర్శన మహోత్సవమును గూడ విశేషముగ తెల్పి విశిష్ట సూత్రమైనది. మరియు అగ్నిష్టోమాది క్రతువుల నాచరించు వారు ఆధాన నక్షత్రమందును ఈ మహోత్సవం చేసుకొనవచ్చునని తెల్పినది.

18. అగ్నిప్రతిష్టాపనమున (ఆఘారము) ఇతర సూత్రములన్నియు చతుష్పాత్ర ప్రయోగమును చెప్పుచు విశేష క్రతువులలో విశేష సంస్కారములలో మాత్రము షట్పాత్ర ప్రయోగమును నిర్దేశింప విఖనసమహర్షి సర్వత్ర 'ద్వాదశపాత్ర ప్రయోగమునే చెప్పి తమ సంస్కార విశిష్టతను చాటుకొనినారు. అట్లే మరే సూత్రము చెప్పనట్టి 'శ్రామణకాగ్ని' విధానమును తెల్పిరి. ఇది యొక కుండభేదము. దీనియందు ఆశ్రమ స్వీకారము చేసిన వానప్రస్థులు మాత్రమే నిత్యాగ్ని వేల్చుదురు.

19. ఈ సూత్రకారులు శ్రౌత స్మార్త భాగములలో చెప్పిన హోమకుండ, పాత్రస్రువాదుల నిర్ణయములు ప్రశంసనీయమైనవి. మరి ఏ ఇతర సూత్రములందును యిట్టి విశిష్టత కానరాదు.

20. యజ్ఞము చేయునపుడు పదునెనిమిది సూత్రములవారికి పదునెనిమిది స్థానములు గలవు. కొన్ని స్థానములను కొన్ని గోత్రముల (సూత్రములవారే) వారే స్వీకరింపవలయునను నిర్ణయముచే "ప్రస్తోతారం వైఖానసం" అను దానిని బట్టి వైఖానస సూత్రానుయాయులు ప్రస్తోత్ర 'ప్రస్తోతార' స్థానమును నిర్వహించుదురని తెలియుచున్నది.

21. ఇతర సూత్రకర్తలు స్నాతకునకు స్నాతకమైన వెంటనే వివాహము తప్పక చేయవలయునని నిర్ణయించిరి. అట్లు కుదరని యెడల

స్నాతకుడు ప్రత్యేకంగా చేయవలసిన నిత్యహోమ విధానమును చెప్ప లేదు. అట్టి స్నాతకునకు విఖనస ఋషి స్నాతక ప్రభృతి పాణిగ్రహణ ములో ఔపాసనమును ఉత్పత్తియగువరకు వ్యాహృతి మంత్రములతో ఆజ్యహోమం చేయవలసిన విధానము చెప్పియున్నారు.

ఇట్లు వివిధాంశములలో నుత్కృష్టతను ప్రదర్శించినదగుటచే వైఖానససూత్ర ముత్తమోత్తమమై సర్వసమగ్రమై స్వయం సంపూర్ణ ముగా వెలుగొందుచున్నది.

శ్రీ వైఖానస సూత్రమును ప్రచురించిన వారి వివరములు :

1. క్రీ. శ. 1914లో గ్రంథాక్షర లిపిలో ఏకాదశ ప్రశ్నాత్మక ముగా కుంభకోణమునందు ముద్రించిరి.

2. క్రీ. శ. 1927లో డాక్టర్ విలియం కెలాండు అను ఆంగ్ల పండితుడు పరిశోధించిన ప్రతిని బెంగాల్ రాష్ట్రంలోని రాయల్ ఏషి యాటిక్ సొసైటీవారు 'నాగరలిపి'లో ప్రచురించిరి. పది ప్రశ్నల స్మార్త బాగం మాత్రమే యిది. దీనినే మరల 1929లో ఆంగ్లానువాదము గాను వారే ప్రచురించిరి.

1941లో వారే 12వ ప్రశ్ననుండి 32వ ప్రశ్నాంతము గల్ల శ్రౌత భాగమును 'నాగరలిపి'లో ప్రకటించిరి.

3. క్రీ. శ. 1943లో గుంటూరు జిల్లా యడ్లపల్లి వారిచే కొద్ది వాక్య భేదములతో తెలుగు లిపి యందు ప్రవర సూత్ర సహితముగా 11 ప్రశ్నలు ప్రకటింపబడినవి.

4. క్రీ. శ. 1960లో గుంటూరు జిల్లా పొన్నూరులోని విఖనస గ్రంథమండలివారు సప్తమ ప్రశ్నాంతము అష్టాదశ కల్ప సూత్ర సమీక్ష పరంపరలో సమీక్షా వ్యాస రూపకముగా ఆంధ్రమున ప్రకటించిరి.

5. క్రీ. శ. 1967లో శ్రీ తిరుమల తిరుపతి దేవస్థానము వారు శ్రీ శ్రీనివాస మఖి వేదాంత దేశిక విరచిత "శ్రీ సూత్ర తాత్పర్య చింతా మణి" అను వ్యాఖ్యతో కలిపి నాగరలిపిలో 10 ప్రశ్నలు ప్రకటించిరి.

6. క్రీ.శ 1973లో కృష్ణాజిల్లా ఉయ్యూరు శ్రీ కృష్ణవేణీ గ్రంథ మాల వారు శ్రౌత సూత్రమును సప్తమ ప్రశ్నాంతము (వైఖానస కల్ప సూత్రమందు 12 నుండి 18 ప్రశ్నాంతం) తెలుగు లిపిలో ప్రకటించిరి.

7. 1984లో శ్రీ వైఖానస మహామండలి విజయవాడ ప్రాంతీయ శాఖ వారి ఆధ్వర్యమున శ్రీ నృసింహ వాజిపేయయాజీ కృత భాష్య సహిత సూత్రము తెలుగు లిపిలో 1 నుండి 5 ప్రశ్నలవరకు ప్రచురింప బడినది.

8. ప్రస్తుతము విజయవాడ శ్రీ వైఖానస మహామండలి వారు 6వ ప్రశ్ననుండి 11వ ప్రశ్నాంతము (శ్రీనృసింహవాజపేయయాజికృత భాష్య సహిత సూత్రమును) తెలుగులిపిలో ప్రచురించిరి.

అదియే యీ మహోన్నత గ్రంథము.

శ్రౌతసూత్రములోని 14వ ప్రశ్నయు 15వ ప్రశ్నయందు కొంత భాగమునకు శ్రీనివాస దీక్షితులవారి వ్యాఖ్యతో నున్న ప్రతి యొకటి మద్రాసు ఓరియంటల్ లైబ్రరీ యందున్నట్లుగా శ్రీ పండిత విలియం కెలాండ్ వారు పీఠికలో వ్రాసిరి. దానిని కూడ సంపాదించి ప్రకటింప వలసిన బాధ్యత స్వశాఖీయులందరిపై నున్నది. భగవానుని కృపవలన అదియు అనతికాలములోనే వెలుగు చూడగలదని ఆశించుచున్నాను.

(సం॥) ఆత్రేయ శ్రీనివాసః

—)o(—

అత్తిలి గోపాలకృష్ణమాచార్యులు
ఎం. ఏ. (సంస్కృతం) ఎం. ఏ., (తెలుగు) బి. యిడి.,
భాషాప్రవీణ, సాహిత్య విద్యాప్రవీణ, లెక్చరర్ & హెడ్ ఆఫ్
ది డిపార్టుమెంట్ ఆఫ్ సంస్కృత శ్రీ Y. S. కాలేజి, నరసాపురం

నరసాపురం
ది 27-8-87

# వాచా పీచిక

శ్రీ వైఖానస వాఙ్మయము మిక్కిలి ప్రాచీనమైనది. అష్టాదశ కల్పసూత్రములలో ఒకటియు యజుశ్శాఖీయమునైన యౌఖేయము సుప్రసిద్ధము. సుప్రసిద్ధమే కాదు, సుప్రశస్తము, సర్వసమగ్రము, అన్యానపేక్షమునై సర్వ తంత్రమైన సూత్రరాజముగా దీనిని పేర్కొను టలో నెట్టి విప్రతిపత్తియు నుండబోదు.

కొందరు పాశ్చాత్య దేశీయులైన ఆంగ్ల పండితులు Dr. Ram Gopal, A. A. Macdonell, T. Gowdrian, W. Caland ప్రభృతులు. భారతదేశమునకు వచ్చి భారతీయ సంస్కృతికి మూలములైన అష్టాదశ కల్పసూత్రములను పరిశీలించి పరిశోధన చేసి శ్రౌత స్మార్త భాగముల నన్నిటిని ముద్రింపచేసి ప్రకటించు సమయమున శ్రీవైఖానస సూత్రము నందలి ఉత్కృష్టతను గ్రహించి వైఖానస స్మార్తసూత్రమును ఆంగ్లాను వాదము చేసి విశ్వవిద్యాలయములందు ఉపవాచకముగా నిర్ణయించి పఠింపచేసిరి. ఇతరదేశీయులై యుండియు ఈ సూత్రమునకు సర్వ సమ గ్రతలో ప్రాధాన్యము కలదని వారందరు ఏక కంఠముగా వక్కాణించిరి. ఇంతటి మహోత్కృష్టమైన కృషిసల్పి మన వైదిక ధర్మములకు దోహద మొనర్చినట్టివారికి మనమెంతయో ఋణపడియున్నాము.

"కల్పము" వేదాంగము లారింటిలో నొక్కటి కల్పవాఙ్మయము సూత్రాత్మకమగుటచే "కల్పసూత్రముల"నుట పరిపాటి. వేదశరీరమునకు కల్పము కరయుగ సదృశము కావున కార్యనిర్వాహోపయోగి 'కల్పః కరౌ' అను భాస్కరాచార్యుల సిద్ధాంత శిరోమణి సూక్తి యీ భావమునే స్పష్టీకరించుచున్నది.

కల్పసూత్రములలో 1 గృహ్య (స్మార్త) 2 ధర్మ 3 శ్రౌత 4 శుల్బల సంజ్ఞలు కల్గిన నాల్గు విభాగములుండును. ఈ నాల్గు భాగములు కల్గిన కల్పసూత్రములు మాత్రమే పరిపూర్ణ కల్పసూత్రములు. 1 గృహ్యమనగా ఆధ్యాత్మిక విధాన గర్భితమైన అష్టాదశ సంస్కారములు సప్త పాకయజ్ఞములను వివరించునది. 2. ధర్మమనగా చాతుర్వర్ణ్యముల వారి యొక్కయు చాతురాశ్రమములును, వాటి స్వీకరణ నియమములు వగైరాలు కూలంకషముగా విశదీకరించునది. 3 శ్రౌతమనగా సర్వ యజ్ఞములను సప్రాయశ్చిత్తముగ నిర్ణయించునది. 4 శుల్బమనగా యజ్ఞపరికరములు, యజ్ఞకుండములు యాగశాల మొదలైనవాటి పరిమాణములు, తూకములు, కొలతలు నిర్ణయించునది. శ్రీ వైఖానస కల్పసూత్రమున శుల్బము వేరుగా లేక ఏఏ క్రియలకు అవసరమగు వాట్లను ఆయా క్రియలయందే నిర్దిష్టముగా విశదీకరింపబడినది. భగవదంశ సంభూతుడైన విఖనసముని కల్పవాఙ్మయముగా సూత్రగ్రథితము కావించిన శ్రీ వైఖానస కల్ప సూత్రము నాల్గు సూత్రములు (1 గృహ్య, 2 ధర్మ, 3 శ్రౌత, 4 శుల్బ సూత్రములు) కల్గియుండుటచే పరిపూర్ణ సిద్ధి కల్గియున్నది. సూత్రమనగా "అల్పాక్షర మసందిగ్ధం సారవద్విశ్వతోముఖం; అస్తోభమనవద్యం చ సూత్రం సూత్ర విదో విదుః" అనుచు నిబంధింపబడిన దాని నిందు సూత్రకారశ్రేష్ఠుడైన విఖనసముని యన్వర్థము గావించెను. భాష్యమనగా "భాషణాద్భాష్య"మని కావ్య మీమాంసలో రాజశేఖరుడు సంక్షేపముగా లక్షణమును చెప్పెను. ప్రాచీనాచార్యులు దీనినే "సూత్రస్థం పదమాదాయ వాక్యైః సూత్రానుసారిభిః । స్వపదాని చ వర్ణ్యంతే భాష్యం భాష్య విదో విదుః॥" ఈ నిర్వచనముల ప్రకారమే సూత్ర గ్రంథములకు భాష్యములు వ్రాయబడుచు వచ్చినవి. శాస్త్రాభ్యాసమునకు ఈ సూత్రభాష్య ప్రక్రియ మిక్కిలి యుపయుక్తమైనది.

వాజపేయమనగా సోమయాగము లేడింటిలో ఇదొకటి "వాజమన్నం పేయం సురాద్రవ్య మస్మిన్నితి వాజపేయః" అను వ్యుత్పత్తిచే అన్నం

సురాద్రవ్యము ప్రధానములుగా చేయబడు సోమయజ్ఞ విశేషము వాజపేయము. వాజపేయ విధానము శ్రీ వైఖానస శ్రౌతసూత్రములో (240-48 పుటల్లో) విపులంగా ప్రతిపాదింపబడినది. "వాజపేయేన బ్రాహ్మణో రాజన్యోవా బుద్ధి కామో యజేత" అనుటచేత వాజపేయ ఫలము సర్వ సమృద్ధియని స్పష్టమౌచున్నది. ఈ భాష్యకర్త వాజపేయ యజ్ఞము చేయగా వీరికి వాజపేయయాజి నామధేయము కల్గినది. వీరిచే రచింపబడిన గ్రంథములలో 1 శ్రీ వైఖానస సూత్ర దర్పణము, 2 శ్రీ సూత్ర భాష్యము, 3 ప్రతిష్ఠా విధి దర్పణము, 4. భగవదర్చా ప్రకరణము, 5 బ్రహ్మోత్సవానుక్రమణిక గ్రంథములు మాత్రం ముద్రింపబడినవి. ఈ మహామహుడు ఇంకను ఏమి గ్రంథములు వ్రాసెనో ఈ పండిత ప్రకాండుని దేశకాలాదుల నిర్దేశమేమియో తెలియవలసి యున్నది. ఈ యాచార్యవర్యుడే తన గురువు (ఆరాధ్యుడు) మరీచియని ప్రతిష్ఠా విధి దర్పణంలో పేర్కొనెను. తాను మాధవాచార్యుల పుత్రుడననియు—నృసింహ శబ్ద పూర్వుడనైన అగ్నిచిత్తు (అగ్నిచయనము చేసినవాడు) అనియు తన రచనలలో నన్నింటను కంఠోక్తిగానే పేర్కొనెను. ఈ మహావిద్వాంసు డిన్ని గ్రంథము బ్రవ్రాసి శ్రీ వైఖానస శాస్త్రము యొక్క అస్థిత్వమును స్థాపించుటయేగాక దీనియొక్క ప్రచుర ప్రచారమున కెంతగానో దోహదం కావించెను.

తిరుమల తిరుపతి దేవస్థానమువారు వైయాకరణ పంచానన పార్థసారథి భట్టాచార్యుల వారి ప్రోత్సాహంచే ముద్రించిన "శ్రీనివాస దీక్షితీయ" నామధేయ ప్రసిద్ధమై శ్రీ వైఖానస స్మార్త (గృహ్య) సూత్ర భాష్యమైన "తాత్పర్య చింతామణి" సంపూర్ణంగా లభ్యం కాకపోటవుచే స ప్తమ ప్రశ్ననుండి చివరివరకును నృసింహవాజపేయ యాజీయ భాష్యమునే సీకరించిరి. అంతేకాదు, ప్రతిప్రశ్నాంతమున నృసింహవాజిపేయ భాష్య విశేషములను ప్రత్యేకంగా ముద్రింపించిరి. శ్రీనివాస దీక్షితీయం (తాత్పర్య చింతామణి) బృహద్గ్రంథమేయైనను దానిలోని అసమగ్రత్వ

మును. ప్రత్యంశవ్యాఖ్యానావరోధ రూప శ్లోక బాహుళ్యము గాన ఆ క్లేశమును శ్రీ నృసింహవాజపేయభాష్యము తీర్చినది. ఇట్లని తాత్పర్య చింతామణి స్వీకార్యము కాదని ఈ యల్పజ్ఞుని తాత్పర్యము కాదు— శ్రీ సూత్ర సూక్ష్మాంశములను జిజ్ఞాసువులైన ఔఖేయ శాఖీయులకు ఈ భాష్య ద్వయం నిత్యం నధ్యేతవ్యమేకాని వేరొండుగాదు.

తాత్పర్య చింతామణిలో సూత్రోపరిభాగమునందా యా సూత్రస్థమైన యంశము పశీర్షికగా (Sub-headding) చూపబడలేదు. మరియు గ్రంథము రెండు భాగములుగా నుండి విషయానుక్రమమంతయు ప్రథమ సంపుటములోనే చేర్చబడినది. ఈ రెండు విషయములును పఠితల కించుకంత అసౌకర్యమును కల్పించుచున్నవి. ఇట్టి లోపము నృ. వా. భాష్యముల రెండింటిలోను తీర్చబడినది. ఉపశీర్షికలు సూత్రోపరి భాగమున చేర్చుట ఏ భాగంలోని విషయములాభాగమునందే వేరుచేసి ముద్రించుట చక్కని మార్పుమాత్రమేకాక ఇది కూర్పరుల యోర్పు నేర్పులకు మంచి తార్కాణం. అంతేకాదు. ఇది పరిష్కర్తల అనుభవదృష్టికి దృష్టాంతం. బహుధా అభినందనీయము. ముఖ్యంగా మహోపకారకము. శ్రీ వైఖానస మండలివారు చేసిన, చేయుచున్న కృషి అద్భుతము. గొల్లప్రోలు వాస్తవ్యులైన కీ. శే. వాడపల్లి రంగనాధాచార్యులు వారిచే సంకలనము చేయబడియున్న శ్రీ వైఖానస మంత్ర ప్రశ్న భాష్యమును కూడ అతి త్వరలో ముద్రించి స్వశాఖీయులకు మేలు చేయగలరని ఆకాంక్షింపుచున్నాను. అలభ్యములును, అముద్రితములునైన స్వశాఖీయ గ్రంథములను క్రమంగా ప్రకాశింపచేయవలసిన బాధ్యత మండలి వహించి శ్రీ వైఖానస దీప్తి దిగ్దిగంత వ్యాప్తి గావించి ప్రాచీనౌన్నత్యమును, సంప్రదాయ వైభవమును మరియొకమారు విజృంభింప చేయవలయునని భావుక భావ వాచా వీచికల దేలుటయే ప్రస్తుత కర్తవ్యమని యింతటితో విరమించుచున్నాను.

(సం॥) అత్తిలి గోపాలకృష్ణమాచార్యులు

"ఆంధ్రపత్రిక" ప్రజోత్పత్తి సంవత్సరాది సంచికలో (1931 సం॥ర)

# కల్ప సూత్రములు

అను వ్యాసమున

## దై. కోటీశ్వర దీక్షితులుగారు

## వైఖానస కల్ప సూత్రము

## వైశిష్ట్యమును గూర్చి వ్రాసిన విషములు

వైఖానస కల్పసూత్రము కూడ తైత్తిరీయ శాఖకు సంబంధించిన కల్ప సూత్రములలో నొకటియే. గృహ్య ధర్మ శ్రౌత విభాగములు మూడున్నూ లభించుచున్నవి. గృహ్య ధర్మ విభాగములు మాత్రము ముద్రితములు. శ్రౌత సూత్రము అముద్రితము. ఈ సూత్రము ననుసరించు బ్రాహ్మణులను "వైఖానస వైష్ణవులని" అందురు. ఆంధ్ర ద్రావిడ కర్ణాటక దేశములందే యీ సూత్రము ననుసరించువారు గలరు. మహారాష్ట్రులందుగాని, ఇతర దేశములందుగాని యీ సూత్రము ననుసరించు బ్రాహ్మణులు లేరు. స్మార్తబ్రాహ్మణులలోగాని, మధ్వ బ్రాహ్మణులలోగాని యీ సూత్రము ననుసరించువారు ఆంధ్ర ద్రావిడ కర్ణాటక బ్రాహ్మణులలో కూడ లేరు.

ఈ కల్పసూత్రమునకు నృసింహకృత ప్రయోగదర్పణ గ్రంథముగలదు. శ్రీనివాస దీక్షితీయ వ్యాఖ్యానము కూడ లభించుచున్నది. ఈ వైఖానస గృహ్య సూత్రమునందు ఇతర సూత్రములకువలె సూత్రాంతర సహాయమక్కరలేదనియు సకల విషయములను తమ సూత్రకారుడే చెప్పియున్నాడనియు ఇతరసూత్రముల కంటె ఇదియే ఈ సూత్రమునందుగల విశేషము అనియు తత్సూత్రానుసారులు సగౌరవముగ చెప్పుకొందురు. ఈ గృహ్య సూత్రములకు సంబంధించిన మంత్రములన్నియు "వైఖానస మంత్ర ప్రశ్నాష్టకము" అను పేరుతో ఆంధ్రాక్షరములలో ముద్రితమైయున్నది.

ఈ గృహ్యసూత్రమునందు బ్రాహ్మ, దైవ, ఆర్ష, ప్రాజాపత్య, గాంధర్వ, రాక్షస, ఆసుర, పైశాచములను అష్టవిధ వివాహ లక్షణములు చెప్పబడినవి.

కృత చౌళస్య మరణే

కృతచౌళ మనుపనీతం జాతకాగ్నినా లౌకికాగ్నినా వా ఽస్మాత్త్వమధేత్యేకర్చ యా దాహయేత్. ౧౩

కృత చౌళ మనుపనీతం కుమారం జాతకాగ్నినా లౌకికాగ్నినావా పితృమేధ తంత్రం సర్వం కృత్వా అస్మాత్త్వ మధిత్యేకయా ఋచా దాహయేత్.

జాతదన్తస్య మరణే

జాతదన్తస్య తేనాగ్నినా పితృమేధవ త్తూష్ణీం దహనం కుర్యాత్. ౧౬

జాతదన్తస్య కుమారస్య తేనాగ్నినేతి జాతకాగ్నినా లౌకికాగ్నినా వా పితృమేధవ త్తంత్రం కృత్వా తూష్ణీ మమన్త్రకం దహనం కుర్యాత్.

అజాతదన్తస్య మరణే

అజాతదన్తం భూమ్యామవటే పిదధాతి. ౧౭

అజాతదన్తం కుమారం కన్యాంచ పూర్వవద్భూమ్యామవటే పిదధాతి.

కృతచౌళకాదీనాం మరణే

అథవా కృతచౌళౌ కన్యాకుమారౌ జాతదన్తం కుమారం మృతదారం విధవా మితరాంశ్చ తూష్ణీం మృతకం స్నాపయిత్వా శాఖయా శ్మశానం పూర్వవత్. అపేతవీతేతి సంమృజ్య చితాయాం ప్రేతమారోప్య హిరణ్యశకల తిల తణ్డులాన్యా ఓ పహేత్యాస్యే నిదధాతి. ౧౮

అథవా కృతే చౌళౌ కన్యా కుమారౌ జాతదన్తం కుమారంచ మృతదారం విధురం చ విధవాం చ ఇతరా మేతేభ్యోఽన్యాన్ అనార్తవ వంధ్యాదీనావద్ధాన్యాంశ్చ తూష్ణీ మమన్త్రకం మృతకం స్నాపయిత్వా పాలాశ్యా శామ్యా వా శాఖయా శ్మశానం పూర్వవదపేతవీతేతి సంమృజ్యశాఖాం విసృజ్య ప్రోక్ష్యతత్ర తిలాక్షతాన్ వికీర్య తత్ర కాష్ఠాని చాలయిత్వా తస్యాం చితాయాం ప్రేతమా

రోష్య హిరణ్య శకలాని చ తిలమిశ్రాణి తండులాని ఆస్య తండులం తాని హిరణ్య శకల తిలతండులాని పూర్వవదా ఓవహేత్యాస్యే నిదధాతి.

**ఆజ్య మస్మాత్త్వ మధీతి వ్యాహృతీశ్చ హుత్వా వాతాస్తే వాన్త్వితి సిగ్వాతం కృత్వేమా ఆపో మధుమత్య ఇత్యాదిభిరుదకుంభం పరీత్యోత్క్షిప్య కపాలశేషోదకం భూః పృథివీ మిత్యాస్యే దత్వా కపాలసంతపనాగ్నినా స్మాత్త్వ మధీ త్యేకర్చయా సావిత్ర్యా వా దాహయతి. ౧౯**

అగ్నా వాజ్య మస్మాత్త్వ మధీతి వ్యాహృతీశ్చ హుత్వా వాతాస్తే వాంత్వితి పూర్వవత్సిగ్వాతం కృత్వా ఇమా ఆపో మధుమత్య ఇత్యాది పూర్వవత్ కృత చ్ఛిద్ర ముదకుంభం పరీత్య ప్రేతస్య పరితః ప్రసవ్యం నీత్వా దక్షిణత స్తిష్ఠన్ పృష్ఠభాగే భూమ్యా ముత్క్షిప్య కపాల శేషోదకం భూః పృథివీ మిత్యాస్యే దత్వా కపాల సన్తపనాగ్నినా అస్మాత్త్వ మధీ త్యే కర్చయా సావిత్ర్యా వా దాహయతి. అతోన్యత్ సభవేత్. అయమాప ద్దాహ్య విధిః. ఏవం దహనం కృత్వా జాతదన్త కృత చౌళకా నుపనీతానాం కుమారాణాంచ పూర్వవ త్తిలోదకాదీన్ దత్వా ద్వాదశాహే సపిండీకరణస్థానే నారాయణ బలిం కుర్యాత్. మృత దారస్య విధవా యాశ్చా నిందితాయా ఇతరేషాం కృత వివాహానామ నిందితానాం చ సపిండీ కరణాన్తం కుర్యాత్. నిందితా నామా పద్దాహ్యానాం ప్రాయశ్చిత్తాన్తే నారాయణ బలిం కృత్వా శ్రాద్ధం కర్తవ్యమ్.

ఇతి ద్వితీయః ఖణ్డః

ఇతి శ్రీ వాజపేయ యాజీయే శ్రీ వైఖానస సూత్ర భాష్యే సప్తమ ప్రశ్నార వివరణే ప్రథమః పటలః

## అథ తృతీయః ఖణ్డః

శవే అన్యాశౌచ యుక్తేచ శ్వ కుక్కుటాది స్పర్శనే ప్రాయశ్చిత్తమ్

**శవేఽన్యా శౌచ యుక్తే శ్వ కుక్కుట సూతికా రజస్వలా**

ద్యైస్స్పృశ్యైః స్పర్శనే చ మృతకం పఞ్చగవ్యైః కుశతో యైశ్చ స్నాపయిత్వా ప్రోక్షణైః ప్రోక్ష్య విధివద్దహనం కరోతి. ౨౦

శవే మృతకే అన్యే నేతరేణా శౌచేన సూతకాదినా యుక్తస్తస్మిన్ అన్యాశౌచ యుక్తే సతి శ్వా శునకః కుక్కుటస్తామ్రచూడః సూతికా ప్రసూతా రజస్వలా ఆదిశబ్దేన ఖరకాక ఆశౌచి ద్విజాతి శూద్రాద్యనులోమ ప్రతిలోమాదయస్తైచ తే అస్పృశ్యాః స్పర్శార్హా మూత్ర విష్ఠాద్యైః తైః స్పర్శనం లేపనం వా యస్య తస్మిన్ శ్వ కుక్కుట సూతికా రజస్వలాద్యైః స్పృశ్యైః స్పర్శనే సతిచ తం మృతకం పంచగవ్యైః కుశతోయైశ్చ స్నాపయిత్వా ప్రోక్షణైరాపోహిష్ఠాది మంత్రైః ప్రోక్ష్య కృచ్ఛ్రత్రయమేకం ప్రాజాపత్యం వా చరిత్వా ప్రోక్ష్య విధివత్ పూర్వోక్తేన విధానేన దహనం కరోతి.

దేశాంతర మృతే శవే జీర్ణే దహన హీనే ప్రాయశ్చిత్తమ్

దేశాన్తరే మృతే దహన విహీనే శ్వ కాకాద్యైః శ్వపే జీర్ణే తదస్థీన్యాదాయ కాషాయతోయైః పఞ్చగవ్యైః కుశతోయైశ్చ ప్రక్షాళ్యాకృతిం కృత్వా తస్యాగ్నౌ వైశ్వదేవం యామ్యం పైతృకం వ్యాహృతీశ్చ ప్రాయశ్చిత్తంహుత్వా విధివద్దహనం కుర్యాత్. ౨౧

దేశాన్తరే పరదేశే మృతే దహన విహీనే శ్వ కాకాద్యైరిత్యాది శబ్దేన జంబుక వృక గృధ్రాదిభిశ్చ శవేజీర్ణే క్షయేసతి తదస్థీన్యాదాయ కృష్ణాజినే నా బద్ధ్వ వేణ్వగ్రే బద్ధ్వాఽనధో నిదధానః. స్వగ్రామం నీత్వా గ్రామ పూర్వాదాయాం నిధాయ కషాయతోయైరితి అశ్వత్థోదుంబర ప్లక్ష వటామ్రజంబూనాం త్వచో గృహీత్వా తోయేషు ప్రక్షిప్య తైః కషాయతోయైశ్చ పంచగవ్యైశ్చ కుశతోయైశ్చ క్రమేణ ప్రక్షాళ్య తదస్థిభిస్తస్యాకృతిం కృత్వా తస్య ప్రేతస్యాగ్నౌ ఔపాసనాదౌ వైశ్వదేవం యామ్యం పైతృకం వ్యాహృతీశ్చ ప్రాయశ్చిత్తమ్ హుత్వా విధి వద్దహనం కుర్యాత్.

<u>అమంత్రకం శవే దగ్ధే ప్రాయశ్చిత్తమ్</u>

**అమన్త్రకం శవే దగ్ధే తదస్థీన్యాదాయ పయసాజ్యేన ప్రక్షాళ్యాకృతిం కృత్వా పూర్వవత్ప్రాయశ్చిత్తం హుత్వా సమన్త్రకం దాహయతి.** ౨౨

అమంత్రకం పితృమేధాది విధినా వినా తూష్ణీం శవే దగ్ధే చ సతి తదస్థీన్యాదాయ సంగృహ్య పయసాక్షీరేణాజ్యేన ప్రక్షాళ్య తస్య ఆకృతిం కృత్వా పూర్వవత్తస్యాగ్నౌ వైశ్వదేవం యామ్యం పైతృకం వ్యాహృతీశ్చ ప్రాయశ్చిత్తమ్ హుత్వా తేనాగ్నినా సమంత్రకం యథా స్యాత్తథా దాహయతి.

<u>అస్థ్నా మప్యలాభే ప్రాయశ్చిత్తమ్</u>

**తదస్థ్నా మప్యలాభే దశాహాదూర్ధ్వం పాలాశపర్ణై ర్విధానేనాకృతిం కృత్వా ప్రాయశ్చిత్తాన్తే తదగ్నినా దాహయేత్.**

తస్య దేశాన్తర మృతస్య వాఽన్యస్యవా అస్థీని తేషాం తదస్థ్నా మప్యలాభే అసంభవే సతి దశాహాదూర్ధ్వం పాలాశపర్ణైః పూర్వోక్తై ర్దర్భైశ్చ విధానేన పూర్వోక్తవిధినా ఆకృతిం కృత్వా తస్యాగ్నౌ పూర్వవత్ ప్రాయశ్చిత్తమ్ హుత్వా ప్రాయశ్చిత్తాన్తే తదగ్నినా దాహయేత్.

**కర్తు రేవా శౌచం భవతి.** ౨౩

కర్తుః తత్సంస్కర్తు రేవా శౌచం భవతి. న సపిండానామ్.

**త్ర్యహం బలినిర్వాపణ మాశౌచం చేతి కేచిత్.** ౨౪

ఇదానీం త్రిరాత్రాశౌచ పక్షమాహ. త్ర్యహం బలీనాం పిండానాం నిర్వాపణం నిక్షేపణం బలి నిర్వాపణం ఆశౌచం చకారాత్తిలోదకాదీంశ్చ దశాహాదూర్ధ్వం కృతాస్థ్యాకృతి దహనానాం పలాశ పర్ణాకృతీ దహనానాంచ విషయే పుత్రాణాం ఇదం బలినిర్వాపణాదికం భవతీతి కేచిద్వదన్తి. వయమిదం మాతాపిత్రో రన్యేషాం విషయం దత్త పుత్రేణేతి కేచిత్. తథా ప్రథమేఽహ్ని ద్వాదశ, ద్వితీయే త్రింశత్, తృతీయే త్రయస్త్రింశత్, తిలోదకాని భవన్తి. తథా త్రయశ్చత్వారః

త్రయః, పిండా బలయశ్చ స్యుః. ద్వితీయే హ్న్యస్థి సంచయనం, చితాపిధానం ప్రథమేహ్ని నగ్నప్రచ్ఛాదనం, పంచనవ శ్రాద్ధాని, చతుర్థే హన్యేక మేవ షణ్ణవ శ్రాద్ధాని స్యుః. తృతీయే హ్ని తీర్థ విసర్జనం చతుర్థే హన్యేకోద్దిష్టం పంచమేహ్నివా యథాకాలం సపిండీకరణం భవేత్. ఏవం త్రిరాత్రా శౌచపక్షే కర్తవ్య మన్య త్పూర్వవత్. ఇదమనాహితాగ్నేః, సర్వత్రా హితాగ్నేః, పున స్సంస్కారేపి దశరాత్రమేవ.

## సూతికాదీనాం మరణే ప్రాయశ్చిత్తమ్

**సూతికాం మృతా ముదక్యాం చ దావాగ్నినా మన్త్రహీనం దాహయిత్వా దశాహేఽతీతే తదస్థిభిః పాలాశపర్ణైర్వా కృతిం కృత్వా దహనం కరోతి.** ౨౬

మృతాం సూతికాం మృతా ముదక్యాం రజస్వలాం చ దావాగ్నినా వనవహ్నినా అమంత్రకం దాహయిత్వా దశాహేతీతే తదస్థీన్యాదాయ కషాయతోయైః పంచ గవ్యైః కుశతోయైశ్చ ప్రక్షాళ్య తదస్థిభిరాకృతిం కృత్వా పూర్వవద్దహేత్. అపివా పాలాశ పర్ణై ర్వాకృతిం కృత్వా పూర్వవద్దహనం కరోతి.

**అథవా తదహ్న్యేవ కాషాయతోయైః పఞ్చగవ్యైః కుశతోయైశ్చ స్నాపయిత్వా పుణ్యాహం కృత్వా ప్రోక్షణైః ప్రోక్ష్య విధివద్దహనం కుర్యాదిత్యేకే.** ౨౭

అథవేతి పక్షాన్తర మాహ. మృతాం సూతికాం మృతా ముదక్యాంచ తదహ్న్యేవ తస్మరణ దిన ఏవ కషాయతోయైః పంచగవ్యైః కుశతోయైశ్చ స్నాపయిత్వా ప్రత్యేక మభిషిచ్య పుణ్యాహం కృత్వా ప్రోక్షణైర్మంత్రైః ప్రోక్ష్య ప్రాజా పత్యం చరిత్వా విదివద్దహనం కుర్యాదిత్యేకే వదన్తి.

ఇతి తృతీయః ఖణ్డః

# అథ చతుర్దశః ఖణ్డః

## సగర్భాయాః మరణే ప్రాయశ్చిత్తమ్

**సగర్భాయా మరణే స్పన్దమానేనోదరేణ జీవన్తం గర్భమాలక్ష్య భర్తా పుత్రో న్యో బన్ధుర్వా వైద్యకుశలాభ్యాం నాభ్యుపస్థయోరన్తరే గర్భం పరిహరన్ హిరణ్యగర్భేతి శస్త్రేణోత్పాటయతి. ౨౮**

సగర్భాయాః గర్భిణ్యా మరణే స్పందమానేన కంపమానేనోదరేణ తస్యాః కుక్షిణా జీవన్తం జీవ్యమానం గర్భమాలక్ష్య జీవన్తమిద మజీవన్త మితి తల్లక్షణం విజ్ఞాయ భర్తా తస్యాః పతిః తదభావే పుత్రస్తదభావే న్యో యోని బన్ధుస్తదభావే బంధుస్స్వజాతిః పుమాన్ తత్ జ్ఞాస్త్రీవా వైద్యకుశలాభ్యాం భిషక్ శస్త్రి వైద్యాభ్యాం ఏవ ముత్పాటయిత్వాలక్షితం నాభ్యుపస్థయోరన్తరే తస్యా నాభి యోన్యోర్మధ్యే గర్భం పరిహరన్ యథా న స్పృశ్యతి శస్త్రం తథా కుర్వన్ హిరణ్యగర్భ స్సమవర్త తాగ్ర ఇతి మంత్ర ముచ్చరన్ శస్త్రేణ క్షురేణోత్పాటయతి. ఛేదయతి.

**శస్త్రి స్పర్శనా ద్గర్భ స్య మరణే పతితో భవతి. ౨౯**

శస్త్రి స్పర్శనాద్గర్భస్య గర్భ గతస్య మరణేసతి పతితః పాపీయాన్ భవతి. తస్మాద్గర్భం పరిహర న్నుత్పాటయతి.

**జీవన్త మపత్య మున్ముచ్య స్నాపయిత్వా ఆదాయ ధాత్రీం లోకమాతర మభ్యర్చ్య తస్యాన్యాం కల్పయతి ౩౦**

జీవన్తం సప్రాణ మపత్యం పుత్రం దుహితరంవా ఉన్ముచ్య గర్భస్థానాదపోద్ధృత్య స్నాపయిత్వా ధాత్రీం లోకానాం జగతాం జనానాంచ మాతా జననీతాం లోక మాతరం ధాత్రీం భూదేవీ మభ్యర్చ్య పుష్పాదిభిః సంపూజ్య తత్ర నీతం విధాయ తమాదా యాన్యస్యై దత్వా తస్యాపత్యస్య రక్షణార్థం అన్యాం స్వజనాం మాతరం ధాత్రీనామికాం జననీం కల్పయతి.

**ప్రేతాయాః కుక్షావాజ్యేన ప్రాణాయస్వాహా, అపానాయ స్వాహేతి హుత్వా నిర్వ్రణం కృత్వా తాం స్నాపయిత్వా విధివద్దహనం కరోతి.** ౩౧

తస్యాః ప్రేతాయాః కుక్షౌ ఆజ్యేన ప్రాణాయస్వాహాఽపానాయ స్వాహేతి పంచభిర్హుత్వా తదుదరం నిర్వ్రణం సూచ్యాదినా అక్షతం యథాస్యాత్తథాకృత్వా తాం మృతాం గర్భిణీం కషాయతోయైః పంచగవ్యైః కుశతోయైశ్చ స్నాపయిత్వా ప్రాజాపత్యం వా చరిత్వా విధివద్దహనం కరోతి.

**కుమారస్య జాతకాగ్నౌ పూర్వవజ్జాతకం కుర్యాత్.** ౩౨

తదపత్యం కుమారశ్చేత్తస్య కుమారస్య జాతకాగ్నౌ పూర్వవజ్జాతకహోమం జుహుయాత్.

## సూతక ప్రేతకయో ఏకాహ సన్నిపాతే ప్రాయశ్చిత్తమ్

**సూతక ప్రేతకయో రేకాహ సన్నిపాతే తన్త్రయిత్వా వాస్తు హోమం హుత్వా పృథగేవోత్థాన హోమం పిణ్డ నిర్వాపం చ కరోతి.** ౩౩

సూతక ప్రేతకయో రాశౌచే ఏకాహ సన్నిపాతే ఏకదిన ప్రాప్తే సతి తంత్రయిత్వా సూతక ప్రేతకాశౌచ నివృత్త్యర్థం వాస్తుహోమం కరిష్య ఇతి సంకల్ప్య ఏకదైవ వాస్తు హోమం హుత్వా పర్యగ్ని పంచగవ్యాభ్యాం గృహాదికం శోధయేత్. పృథగేవ కుమారస్యోత్థాన హోమం ప్రేతాయా ఏకోద్దిష్ట శ్రాద్ధాదికం పిండ నిర్వాపణం చ కరోతి.

## పాప మరణే ప్రాయశ్చిత్తమ్

**బ్రాహ్మణాద్వైశ్చణ్డాలాన్తైరద్భిస్సర్పైణ దంష్ట్రినాశనిపాతే నాగ్నినా పశునావా పాపమరణే తస్యా శౌచ వాక్షోదకమప్నాశ్రు శవ ధరణానుగమన దహనోదక బలిపిణ్డ దానాదికస్య చినైవ కుర్యాత్.** ౩౪

సంప్రతి పాపమరణ విధిమాహ. బ్రాహ్మణాద్యైశ్చండాలాన్తైర్జనైర్వా ఆద్భిర్వా సర్పేణ వృశ్చికేన వా దంష్ట్రా దన్తవిశేష స్తదస్యేతి దంష్ట్రీ తేన దంష్ట్రిణా వారాహ వ్యాఘ్ర వృక గజ సింహాదినా మృగేణవా అశనిపాతేనవా అగ్నినా దవగృహదాహ విద్యుదాది వహ్నినా పశునా గోమహిషా శ్వ ఖరాదినా వా పూర్వోక్తేన రజ్జు శస్త్ర విష విభ్రమ భృగుపతన మహౌఘ పరిసర్పణాదినాన్యేనవా పాపమరణే దుర్మరణే సంభవేసతి తస్యమృతకస్యా శౌచం వాక్తోదః ఆస్యే*తుత్ భవతీతి వాగ్వ్యథా కంపనం దుఃఖాద్వేపనం అశ్రురోదనం శవ భరణం తద్వహన మనుగమనం తదనుయానం దహనమగ్ని దాహన ముదకం తిలోదకం బలిః సాయం ప్రాతర్బలిః పిండ స్తదాది సపిండీకరణాన్తాంగ పిండ నిక్షేపః దానమేత ముద్దిశ్య యత్కించిద్ద్రవ్య త్యాగః ఏతేషాం దానంవా ఏతాని కస్య చిత్పాప మృతస్య పిత్రాదేరపినైవ కుర్యాత్.

ఏతాని కర్తుశ్చాన్ద్రాయణం తప్తకృచ్ఛ్రం ప్రాయశ్చిత్తం భవతి. ౩౫

కిమిత్యత ఆహ. ఏతాని పూర్వోక్తాన్యశౌచాదీని భయాదజ్ఞానాన్మోహాద్వా యః కరోతి తస్య కర్తుః పుత్రాదేః చాంద్రాయణం తప్త కృచ్ఛ్రం చ ప్రాయశ్చిత్తమ్ భవతి. తస్మాదాశౌచాదీని కస్య చిన్నైవ కుర్యాత్.

పాప మృతస్య శరీరం దావాగ్నినా శూద్రైర్దాహయిత్వా దశాహేఽతీతే నారాయణ బలిం కుర్యాత్. ౩౬

కింతర్హీత్యతఆహ. పాపమృతస్య పిత్రాదేః శరీరం స్వయమస్పృశ్యన్ శూద్రైర్దావాగ్నినా దాహయిత్వా దశాహేతీతే తదుక్త ప్రాయశ్చిత్తమ్ చరిత్వాన్తే సర్వ ప్రాయశ్చిత్తార్థం నారాయణబలిం కుర్యాత్.

అథవా పాలాశపర్ణై రేవా కృతిదహనం కరోతి. ౩౭

తదస్థిభిః పాలాశపర్ణైర్వా పూర్వవదాకృతిం కృత్వా తదగ్నినాఽకృతిదహనం కృత్వా పూర్వవత్సపిండీకరణాన్తం కరోతిత్యత్ర కేచిద్వదన్తి.

---

* తుత్ = తుదపీడనే ధాతుః.

శ్లో॥ శస్త్రాద్యుత్పాటనం కృత్వా ఆత్మానం యస్తు ఘాతయేత్
తస్య పాప విశుద్ధ్యర్థం ప్రాజాపత్య శత త్రయమ్
విషోద్బన్ధన శస్త్రాద్యై రాత్మానం ఘాతయే ద్ద్విజః
జీవేత్కృచ్ఛ్రేణ శుద్ధ్యేత్తు దత్వా గోమిధునం ద్విజః
ఉదక్యా శవ విష్ఠా ద్యైః వ్యాఘ్రసింహ హయాది భిః
రజకవ్యాధ శైలూషపశుదంష్ట్రి ముఖై స్తథా
చండాల శ్వపచక్షత్రవేణు చర్మోపజీవిభిః
సూతికాశ్వవరాహాద్యైః వ్యాఘ్రసింహ హయాదిభిః
స్పృష్టేచ చర్వితే ప్రోక్తం కృచ్ఛ్ర త్రయం పృథక్ పృథక్.

ఇత్యాది వచనై రుక్త ప్రాయశ్చిత్తమ్ తత్పుత్రాదిభిరా చరిత్వా విధి వద్దహేదితి.

## శవస్య దహన కాలేఽతీతే ప్రాయశ్చిత్తమ్

**శవస్య దహనకాలేఽతీతే క్రియాహీనే విపర్యాసేచ ప్రేత కర్మణి సర్వత్ర తిస్రై రేవ వైశ్వదేవం యామ్యం పైతృకం వ్యాహృతీశ్చ ప్రాయశ్చిత్తం జుహోతి.** ౩౭

శవస్య దహనే కాలేతీతే క్రియాహీనే విపర్యాసే చ ప్రేతకర్మణి సర్వత్ర తిస్రై రేవ వైశ్వదేవం యామ్యం పైతృకం వ్యాహృతీశ్చ ప్రాయశ్చిత్తమ్ జుహోతి.

## శవదహనాగ్నా వుత్సన్నే ప్రాయశ్చిత్తమ్

**శవస్య దహనార్థం హోమేహుతే తదగ్నా వుత్సన్నే పూర్వవద్భస్మ సమిధమారోప్య లౌకికాగ్నౌ నిధాయ ప్రాయశ్చిత్తమ్ హుత్వా తేనాగ్నినా దహనం కుర్యాత్.** ౩౮

శవస్య దహనార్థం హోమే హుతే తదగ్నా వుత్సన్నే పూర్వవద్భస్మాయం తే యోనిరితి సమిధమారోప్యో ద్బుధ్యస్వేతి లౌకికాగ్నౌ నిధాయ ప్రాయశ్చిత్తం మనోజ్యోతి రయాశ్చాగ్నే మిందాహుతీ వ్యాహృతీ శ్చాజ్యేన హుత్వా తిస్రై ర్వైశ్వ దేవాదికంచ హుత్వా తేనాగ్నినా దహనం కుర్యాత్.

ఇతి శ్రీ వాజపేయ యాజీయే శ్రీ వైఖానస సూత్ర భాష్యే సప్తమ ప్రశ్నార్ధ వివరణే ద్వితీయః పటలః ఇతి చతుర్థః ఖణ్డః

## అథ పంచమః ఖణ్డః

ఉపనయనాదూర్ధ్వం మరణే ఆశౌచ నిర్ణయః

ఉపనయనాదూర్ధ్వం బ్రాహ్మణస్య మరణే సపిణ్డానాం దశాహ మాశౌచం విధీయతే. ౪౦

ఇదానీం శావాశౌచ నిర్ణయ మాహ. ఉపనయనా దూర్ధ్వం బ్రాహ్మణస్య మరణే సపిండానాం దశాహ మాశౌచం విధీయతే. క్షత్రియస్య ద్వాదశాహం వైశ్యస్య పంచదశాహం సపిండానా మాశౌచం విధీయతే. ఉపనీతస్య వా గర్భాష్టమస్య వా మరణే ప్రత్యాసన్న సపిండానాం దశరాత్రం, పంచమానాం షడ్రాత్రం, షష్ఠానాం చతూరాత్రం, సప్తమానాం త్రిరాత్ర మితి కేచిత్ వదన్తి.

దంత జననా దూర్ధ్వం ఆశౌచ నిర్ణయః

దన్త జననాదూర్ధ్వం త్ర్యహం నామకరణా దూర్ధ్వ మేకాహం జననాదూర్ధ్వం సద్య శ్శౌచమ్. ౪౧

దన్త జననాదూర్ధ్వం చౌళాత్ప్రాగ్దాహత్యాగయో స్త్రిరాత్రం నామకరణాదూర్ధ్వం (దన్త జననా త్ప్రాక్). నిఖననేత్వేకరాత్ర మాశౌచం సపిండానాం విధీయతే. జననాదూర్ధ్వం నామ్నః ప్రాక్ స్నానాంత మాశౌచం, జననా దూర్ధ్వ ముత్థానాత్ ప్రాక్ సద్యశ్శౌచం సపిండానాం విధీయతే.

స్త్రీ మరణే ఆశౌచ నిర్ణయః

స్త్రియాశ్చ మరణే వివాహోదూర్ధ్వం దశాహమష్టవర్షాదూర్ధ్వం త్ర్యహం చౌళకాదూర్ధ్వ మేకాహం పూర్వం సద్యశ్శౌచమ్.

స్త్రియా దుహితుర్మరణే చ వివాహో దూర్ధ్వం భర్త్రాది సపిండానాం దశాహ మాశౌచం విధీయతే. వాగ్దత్తానా మనూఢానాం మరణే స్వ సపిండానాం పర సపిండానామపి త్రిరాత్రం వాగ్దత్తానా మష్టవర్షా దూర్ధ్వం భర్త్రాది స్వసపిండానాం త్రిరాత్రమాశౌచం విధీయతే. చౌళకాదూర్ధ్వం వాగ్దత్తానాం మరణే సపిండానా మేకాహ మాశౌచం విధీయతే. పూర్వం చౌళకాత్ప్రాక్ స్త్రియా మరణే సపిండానాం సద్యః శౌచం విధీయతే.

మాతాదీనాం ఆశౌచ నిర్ణయః గర్భస్రావే ఆశౌచ నిర్ణయంచ

**మాతా పిత్రోర్భ్రాతౄణాంచ సర్వత్ర దశాహమేవ గర్భే మృతే గర్భిణ్యా స్తన్మాసతుల్యై రహోభిరాశౌచమ్.** ౪౩

తస్య మృతకస్య మాతా పిత్రోశ్చ భ్రాతౄణాం సోదరాణాంచ సర్వత్ర పూర్వోక్తేష్వాశౌచ విషయేషు దశాహ మాశౌచం విధీయతే. నామకరణాత్ప్రాగ్భ్రాతౄణాం దశరాత్ర మాశౌచ మితి కేచిత్. క్రీతాద్యనౌరస పుత్రాణాం జననే మరణేచ త్రిరాత్ర మాశౌచం భవతి, గర్భేమృతే వినాశేసతి గర్భిణ్యా బ్రాహ్మణ్యా తన్మాస తుల్యైరితి తద్గర్భస్య యావన్తో మాసాః పూర్ణాస్తైః తుల్యా సంఖ్యా యేషాంతై స్తన్మాస తుల్యై రహోభిర్ది నైరాశౌచం విధీయతే. ప్రథమాదిషు త్రిషుమాసేషు జనన్యా స్త్ర్యహం చతుర్థే చతురహం పంచమే పంచాహం షష్ఠే షడహం ఏవం తన్మాస తుల్యై రహోభిరాశౌచం, సప్తమ మాసాదిషు తస్యా స్సూతికా శౌచం విధీయతే. అత్ర సర్వత్ర పితుః స్నానాన్తమాశౌచం. పంచమాస ప్రభృతి సపిండానామపి స్నానాన్త మాశౌచం విధీయతే. జాతస్య మరణే మాతాపిత్రోర్దశాహ మాశౌచం విధీయతే. ప్రసూతాయాం దుహితరి మృతాయాంచ పితృగృహే మాతాపిత్రో స్త్రిరాత్రమితరేషాం తద్గృహవాసే సత్యేకరాత్ర మాశౌచ మితి విధీయతే.

సూతక ప్రేతకయో స్సజాతీయ సమాగమే ఆశౌచ నిర్ణయః

**సూతకేచాన్య సూతకే ప్రాప్తే ప్రేతకే చాన్య ప్రేతకే ప్రాప్తే పూర్వాశౌచేన శుద్ధి స్స్యాత్.** ౪౪

సూతకే వర్తమానే తుల్య నిమిత్తే తుల్య సంఖ్యాకే అసమానదివస ప్రాప్తి కేచాన్య సూతకే ప్రాప్తే సతి ప్రేతకే శావాశౌచే వర్తమానే తథాన్య ప్రేతకేచ ప్రాప్తేసతి పూర్వాశౌచే నేతర స్యాగన్తుకస్య ఆశౌచస్య శుద్ధిః స్యాత్. ఆశౌచ నివృత్తిః స్యాత్. ద్వితీయ సూతికాయాః ద్వితీయ శావాశౌచస్య తత్సంసర్గిణో భర్తు రపి. నపూర్వతః శుద్ధి. నకుత్రాపి సూతక వశాచ్ఛావ నివృత్తిః. శావ వశాత్. సూతక నివృత్తి ర్భవతి. ఏతత్సర్వం తుల్య సంఖ్యా విషయమ్. విషమసంఖ్యా విషయే దీర్ఘ వశా త్స్వల్పస్య సమాప్తిః. న స్వల్పా ద్దీర్ఘ

సమాప్తిః యది స్వల్పేపి పశ్చాద్భవి దీర్ఘాదికః స్యాత్తథా స్వల్పవశా ద్దీర్ఘస్యాపి సమాప్తిః. పంచదినాధికా దల్పా దపి దశరాత్రా దేకోత్తర తోధికా శౌచాంత్య దివసే పూర్ణా శౌచ ప్రాప్తే సతి పూర్వస్మా దుపరి ద్వ్యహాచ్ఛుద్ధి ర్భవేత్. అత్రాపి ప్రభాతే చేత్త్రి రాత్ర మధికం భవేత్. పూర్ణాశౌచస్యోత్తర తోఽధికా శౌచాన్త్య దివసే తత్ప్రభాతే వా ప్రాప్తే పూర్వాశౌచే నైవ శుద్ధిః స్యా దిత్యర్థః.

ఇతరస్య ప్రాప్తేఽపరస్యైవా హోభి శ్శుద్ధి ర్భవతి. ౪౫

సూతకే వర్తమానే పరస్య శావా శౌచస్య ప్రాప్తౌ సత్యాం పరస్యైవ శావస్యైవా హోభిర్దినైః శుద్ధి రాశౌచ నివృత్తి ర్భవతి.

## అసపిండ శవస్య స్నానాదౌ కృతే ఆశౌచ నిర్ణయః

అసపిండ శవస్య స్నానాలంకరణే కృతే త్ర్యహం దివసంవా వహనే కృతే స్నాత్వా దశప్రాణా యామాన్కృత్వా నక్షత్ర దర్శనా త్పూర్వం గ్రామాద్బహి రాసీత. ౪౬

అసపిణ్డ శవస్య సజాతీయస్య విజాతీయస్య వా బ్రాహ్మణస్య సగోత్ర ప్రేతస్య స్నేహాదినా స్నానాలంకరణే కృతే సతి త్ర్యహం దివసమేకదినంవా ఽశౌచం భవతి. అసపిణ్డ శవస్య వహనే భరణే దహనే వా కృతే సతి సచేలం స్నాత్వా దశప్రాణా యామాన్ కృత్వా నక్షత్ర దర్శనాత్పూర్వమితి యావన్నక్షత్ర దర్శనం భవతి తావద్గ్రామాద్బహిః బాహ్యప్రదేశ ఆసీత ఉపవిశేత్.

తావ దేవా శౌచమ్. ౪౭

నక్షత్రం దృష్ట్వా గ్రామం ప్రవిశేత్.

రాత్రౌ సూర్యోదయా త్పూర్వ మాసీత. ౪౮

రాత్రౌ చేద్దహన వహనాది కరణం సూర్యోదయా త్పూర్వమితి యావత్ సూర్య ఉదితేతావత్ గ్రామాద్బహిరాసీత. సూర్యం దృష్ట్వా గ్రామం ప్రవిశేత్. ఉభయత్ర తావదనశన మేవ కర్తవ్యమ్. పశ్చా త్పంచగవ్యం ప్రాశ్యానుష్ఠానం కుర్యాత్. భృత్యపేక్షయా దహనవహనాదికం కుర్వాణస్య పూర్వా ద్ద్విగుణం ధర్మార్థం దహనాది క్రియమాణస్య సచేల స్నాన మేవ భవేత్.

గ్రామ ప్రవేశనాదిషు ఆశౌచ నిర్ణయః

అన్యథా తద్గ్రామే ప్రవిష్టే శవభర్తురేకాహం తద్గృహే ప్రవిష్టే త్ర్యహం తత్ర భోజనే కృతే దశాహం భవతి. ౪౯

అన్యథా ఏవ మకృత్వా తద్గ్రామే మృతకస్య గ్రామే ప్రవిష్టేసతి శవభర్తుస్తస్య మృతక వాహకస్య ఏకాహ మాశౌచం భవతి తద్గృహే ప్రేతస్యగృహే ప్రవిష్టే సతి త్ర్యహం ఆశౌచం భవతి. తత్రాశౌచే గృహేభోజనే కృతే దశాహమాశౌచం భవతి. గత్యంతరాభావే భుక్తవత ఏకరాత్రం. అజ్ఞానాద్భుక్త వతః తదన్న శుద్ధ్యవధిక మాశౌచం. ఆశౌచిభి స్సహ శయనాదిభిర్వా సతాం వసిత దినాన్యా శౌచం భవతి. అస్థి సంచయనాదర్వాక్ బ్రాహ్మణస్య రుదిత్వా స్నాయాత్. అన్తర్దశా హేత్వాచమనం కుర్యాత్. క్షత్రియవైశ్య యో రస్థి సంచయనా దర్వాక్. బ్రాహ్మణోరౌతిచేత్ ఏకరాత్ర మాశౌచం పశ్చాత్సచేలం స్నానం శూద్రవిషయేఽస్థి సంచయనాదర్వాక్ శవస్పర్శే సతి త్రిరాత్ర మాశౌచం తద్రహితే ద్విరాత్రం పశ్చాదేకరాత్ర మాశౌచం భవతి. సమానహీన వర్ణన విషయే రోదనే యవా శౌచముక్తం తదే (ఖ. గ) వాస్యాశౌచ మితి విధీయతే.

ఇతి పంచమః ఖణ్డః

## అథ షష్ఠః ఖణ్డః

శవ స్పర్శనే ప్రాయశ్చిత్తమ్

ప్రేతం జ్ఞాతి మజ్ఞాతిం వానుగమ్య స్నాత్వాగ్నిం స్పృష్ట్వా ఘృతం ప్రాశ్నీయాత్. ౫౦

జ్ఞాతి మజ్ఞాతింవా ప్రేతమనుగమ్య వా తత్ జ్ఞాతీ ననుసృత్యవా సచేలం స్నాత్వా పాణిభ్యా మగ్నిం స్పృష్ట్వా ఘృతం గవ్యమన్యం వాఽజ్యం హృదయాంగమ మాత్రం ప్రాశ్నీయాత్. పునస్స్నాత్వా శుద్ధ్యతి.

అసపిండ మరణే ప్రాయశ్చిత్తమ్

**ఆత్మనః పితుః మాతుశ్చ యోనిబంధూనాంచ మరణే విజ్ఞాతే సచేలస్నానం కరోతి.** ౫౧

ఆత్మనః స్వస్య పితుశ్చ మాతుశ్చ మరణే యదా విజ్ఞాతే శ్రుతే సతి తదా యత్ర కుత్ర వా స్థితః పుత్రః సచేలస్నానం కృత్వా తదాది దశాహమాశౌచం కరోతి. యోనిబంధూనా మిత్యత్ర విషయ విభాగః కర్తవ్యః. మాతృపిత్రో ర్మాతృభ్రాతుర్మాతృష్వసుశ్చ మరణే విజ్ఞాతే త్రిరాత్ర మాశౌచం శ్వశుర యో ర్మరణే విజ్ఞాతే త్రిరాత్ర మాశౌచం ఋత్విజశ్చా చార్యస్య చాచార్య పత్న్యాశ్చా చార్య సుతస్య యాజకస్య చ శిష్యస్య చ గృహప్రాప్త శ్రోత్రియస్య చ మరణే విజ్ఞాతే జ్ఞాతి వ్యతిరిక్త త్వేసతి త్రిరాత్రమాశౌచం మాతృష్వస్రాదీనాం ప్రాదు ర్భూత రజసామేవ త్రిరాత్ర మిత్యేకే. అప్యుభయత్ర సద్యశ్శౌచమితి కేచిత్. మాతామహస్య మాతామహ్యోః పితామహస్య పితామహ్యోః మాతుర్మాతులస్య తత్పుత్రదుహిత్రోః మాతృష్వ సుస్త త్పుత్ర దుహిత్రోః పితుః పితృవ్యస్య తత్పుత్ర దుహిత్రోః పితృష్వసుస్తత్పుత్ర దుహిత్రోః భ్రాతుస్త త్పుత్ర దుహిత్రోః స్వసుస్త త్పుత్ర దుహిత్రోః దుహితుః తత్పుత్ర దుహిత్రోః స్వ పుత్ర దుహితుశ్చ మరణే పక్షి ణ్యాశౌచం పురుషవిషయే పక్షిణ్యుపనీత మరణే భవతి. కృత వివాహ స్త్రీ విషయే పక్షిణీ ప్రాదుర్భూత రజసోమరణే భవతి. ఉభయత్రాప్యతోఽర్వాక్సద్య శ్శౌచం భవతి. మాతృ సపత్న్యా ఊఢాయా స్సపత్నీ సుతాయాశ్చ మరణే చైకరాత్రం ఏకగ్రామవాసినః శ్రోత్రియాదేః సుహృదశ్చ మండలాధిపతేశ్చ శ్వశురస్య చ మరణే విజ్ఞాతే త్వేకరాత్ర మాశౌ చం భవతి. అన్యేషాం యోనిబంధూనాం చ మరణే విజ్ఞాతేసతి సచేల స్నానం కరోతి.

ప్రేత శిలార్చనం :

**ద్వితీయేఽహని పునర్దహన ప్రభృతి తదశ్మన్యుదకం దత్వా దక్షిణాగ్రం కూర్చం నిధాయ తన్నామ్నా ప్రేత మావాహ్య తైల మజ్జనం స్నానం వాసోదకం దత్వా**

**పాద్యాచమన గన్ధపుష్ప ధూప దీపాక్షతాచమనై రభ్యర్చ్య సాయం ప్రాతర్బలిం దత్వోదకం దదాతి.** ౫-౨

ద్వితీయేహనీతి. ఆహితాగ్నే రనాహితాగ్నేశ్చ దేశ్చ దహనదినా ద్వితీయేహని పూర్వవత్ పునర్దహనం కృత్వా పునర్దహన ప్రభృతి యదశ్మ పూర్వేద్యురవటే నిక్షిప్తం తదశ్మని ఉదకమితి పూర్వవద్వాసోదకం దత్వా అవటయోః ప్రత్యేకం దక్షిణాగ్రం కూర్చ మశ్మనాసహ నిధాయ తన్నామ్నేతి గోత్రం శర్మాణం ప్రేతమావాహ యామీతి ద్వితీయాన్తే తన్నామ్నా ప్రేతమావాహ్య గోత్రాయ శర్మణే ప్రేతాయ తైలం దదామీతి తైలాభ్యంగం ప్రేతాయాంజనం దదామీత్యం జనం ప్రేతాయ స్నానం దదామీతి స్నానం వస్త్రం దదామీతి వాసః శర్మణే ప్రేతాయ తిలోదకం దదామీత్యుదకం ఏవం క్రమేణ దత్వా పునశ్చతుర్థ్యన్తేన తన్నామ్నా పాద్యాచమన గంధపుష్ప ధూప దీప మక్షత మాచమనం దదామీతి క్రమేణ దత్వా తైః పాద్యాద్యైః ప్రేతమభ్యర్చ్య గోత్రాయశర్మణే ప్రేతాయ పిండం దదామీతి పిండం ఏవం సాయంబలిం ప్రాతర్బలిం దత్వా ప్రేతాయ పానీయం దాదామీత్యుదకం దదాతి.

## ప్రేత శిలాయాం బలౌ హీనే ప్రాయశ్చిత్తమ్

**ప్రాతర్బలౌ హీనే సాయం ద్విగుణం సాయం హీనే ప్రాతర్ద్విగుణ మేవ మా దశాహాత్కరోతి.** ౫-౩

ప్రాతర్బలౌ హీనే సాయం ద్విగుణం దద్యాత్. సాయంబలౌ హీనే ప్రాతర్ద్విగుణం బలిం దద్యాత్. అపివాసాయ మపకృష్య ప్రాతరేవ దదాతి. ఏవ మా దశాహాత్కరోతి.

## ప్రేతాశ్మనిశ్వ కుక్కుటాద్యై స్పృష్టే ప్రాయశ్చిత్తమ్

**శ్వ కుక్కుట సూతికోదక్యా న్త్య జైరశ్మని స్పృష్టే పఞ్చగవ్యైః ప్రక్షాళ్య బలిం దద్యాత్.** ౫-౪

శ్వ కుక్కుట సూతికోదక్యాన్త్య జై రశ్మని తదవటస్థే పాషాణే స్పృష్టేసతి తదశ్మానం పంచగవ్యైః ప్రక్షాళ్యావటే నిధాయ పూర్వవద్బలిం దద్యాత్.

యద్యశ్మని నష్టే పునరన్య మశ్మానం నిధాయ ప్రేతమావాహ్యా భ్యర్చ్య గత తిలోదకాదీన్ పునరావర్త్య కృత్వా తాత్కాలికం బలిం దద్యాత్. శ్వ కుక్కుట సూతికాద్యైః పిండ భాండే స్పృష్టే నష్టేవా పునర్నూతనేన భాండేన చరుం శ్రపయిత్వా తాన్ పిండాన్ బలీంశ్చ పునరావర్త్య దత్వా తాత్కాలికం బలిం దద్యాత్.

అస్థి నిక్షేపః

సప్తమేఽహని నవే మృత్పాత్రే చితాస్థీన్యాదాయ పుణ్య నద్యాం సముద్రేవా ప్రక్షిపతి. ౫౫

సప్తమేఽహని నవే మృత్పాత్రే చితాయా మవశిష్టా న్యస్థీని పూర్వమేవ సంచితాని నియుక్తావశిష్టా న్యస్థీన్యప్యాదాయ సంగృహ్య వంశ యష్ట్యాం బద్ధ్వాఽనధో నిదధానః పుణ్యనదీం గంగాద్యాస్వన్యతమాం సముద్రగామినీం పావనీం నదీం గత్వా తస్యాం పుణ్యనద్యాం వా పూర్వవత్స్నాత్వా పంచగవ్యే నాస్థీని ప్రక్షాళ్య వల్మీకాది శుద్ధ మృదాకృతే పాత్రే సతిలహిరణ్య శకలాన్యస్థీని సంగృహ్య సంపుటీకృత్య తమాదాయాగాధ జలం ప్రవిశ్య నిమజ్జ్యా ఘమర్షణ సూక్తం జపన్ ప్రక్షిపతి. పర్వణి సముద్రంగత్వా రత్నాకర నమస్తుభ్య మితి ప్రణమ్య పిప్పలాద సముత్పన్న ఇతి మంత్రావృత్త్యా సప్త పాషాణాన్ సముద్రే ప్రక్షిప్య సర్వరత్న మయశ్రీమన్నిత్యర్ఘ్యం దత్వాఽవగాహ్య విశ్వాచీ చ ఘృతాచీ చేతి స్నాత్వా పిప్పలాదం తర్పయామీత్యాదిని తర్పయేత్. ఏవ మన్యత్ర తత్కాలోప్త క్త వత్స్నాత్వా పూర్వవదస్థీ న్యాదాయాఘ మర్షణ సూక్తం జపన్ సముద్రేవా ప్రక్షిపతి.

అన్తర్దశాహే దర్శ సంభవే

అన్తర్దశాహేఽ మావాస్యా యది భవే త్తస్యామేవ శేషా న్బలీ న్దత్వా బలికర్మ సమాప యతి. ౫౬

అన్తర్దశాహే దశాహ మధ్యేఽమావాస్యా యది భవేత్త స్యా మమావాస్యా మేవ శేషాన్ దత్వాఽవశిష్టాన్ తిలోదకాన్ బలీనపకృష్యదత్వా బలికర్మ సమాపయతి. సమాప్తిం కరోతి.

**ద్వి చన్ద్రి దర్శనే మహాన్దోషో భవేత్.** ౫౭

యస్మాదిత్యత ఆహ. ద్వి చంద్ర దర్శనే ద్వయోర్మాసయోశ్చన్ద్రి దర్శనం ద్వి చన్ద్రి దర్శనం తస్మిన్ సతి మహాన్ మహత్తరో దోషః తత్కాలస్య భవేత్. అయం మాతా పిత్రోరన్యేషాం అపివా త్రిదినాదూర్ధ్వ విషయః. త్రిదినాదర్వాగమా వాస్యా చేత్తా మతిక్రమ్య కర్తవ్యమ్.

ప్రేత శిలా విసర్జనం

**దశమేఽహన్యేకదా బలిం దత్వాఽశ్మానం విసృజేత్.** ౫౮

దశమేఽహన్యేకదా ఏకకాలే ప్రాతర్బలిం దత్వా పూర్వవదశ్మానం విసృజేత్.

ఇతి శ్రీ వాజపేయ యాజీయే శ్రీ వైఖానస సూత్ర భాష్యే సప్తమ ప్రశ్నార్ధ వివరణే తృతీయః పటలః

ఇతి షష్ఠః ఖణ్డః

## అథ సప్తమః ఖణ్డః

**జాతదన్తస్య చౌళకాత్ పూర్వం మరణే త్ర్యహం భూమౌ తూష్ణీం బలి నిర్వాపణ మిత్యేకే.** ౫౯

జాతదన్తస్య చౌళకాత్పూర్వం మరణే త్ర్యహం తదాది త్రిదినం త్రీన్ త్రీన్ తిలాంజలీన్ దత్వా భూమౌ తూష్ణీం బలి నిర్వాపణం కృత్వా నారాయణ బలిం కుర్యాదిత్యేకే వదన్తి.

**దహన ప్రభృత్యా హితాగ్నేర్మరణ ప్రభృత్యనాహితాగ్నే రేకాదశే హన్యేకోద్దిష్టం కుర్యాత్.** ౬౦

దహన ప్రభృతి దహనకాలాదారభ్య ఆహితాగ్నేః మరణ ప్రభృతి మరణకాలాదారభ్య అనాహితాగ్నేః తథా తత్త త్పత్న్యాశ్చ ఏకాదశేహన్యేకోద్దిష్ట శ్రాద్ధం కుర్యాత్.

ఏకోద్దిష్ట నిమిత్త శ్రాద్ధే తన్నామ్నా ప్రేత నిమిత్తం భుఙ్క్ష్వేతి బ్రాహ్మణం వరయిత్వా ప్రేతాయస్వధా ఇతి పాణౌ తిలోదకం దత్వా హోమం పిణ్డ దానంచ కృత్వాఽన్నాది సకృత్సకృ ద్దత్వా భోజయేత్. ౬౧

ఏక ముద్దిశ్య క్రియత ఇత్యేకోద్దిష్టం ఏకోద్దిష్ట కారణంచ తచ్ఛ్రాద్ధం తస్మిన్ ఏకోద్దిష్ట నిమిత్త శ్రాద్ధే గోత్రస్య శర్మణః ప్రేతస్యేతి తన్నామ్నా ప్రేత నిమిత్తం ప్రేత తృప్త్యర్థం భుంక్ష్వేతి భోక్ష్యతామితి పూర్వవత్ ప్రత్యేకం బ్రాహ్మణం వరయిత్వాఽఽసయిత్వాఽభ్యర్చ్య పూర్వవత్ ప్రత్యేక మర్ఘ్య పాత్రం సంపాద్య ప్రేతాయ స్వధేతి పాణౌ తత్కరే తిలోదకం దత్వా హోమం పిండాదానం చ పూర్వవత్కృత్వా పాత్రాణ్యుప స్తీర్యాన్నాది సర్వం భోజ్యం సకృత్సకృత్పాత్రేషు దత్వా తాన్ బ్రాహ్మణాన్ యథా తృప్తి భోజయేత్.

ఉద్యన్తం వా దదాతీతి కేచిత్. ౬౨

అశక్త శ్చేదన్నా భావేవా భోక్తృ భావేవా ఉద్యన్తం వా ఆమం వా దదాతీతి కేచిద్వదన్తి. భోజనార్థం ద్వి ప్రస్థ తండులైః పూర్వవత్తిలౌదనం సాపూప వ్యంజనం పక్త్వా పాత్రే ప్రక్షిప్య ప్రభూతేన సర్పిషోప సిచ్య ద్వాత్రింశత్కబళాని కృత్వాఽగ్ని మభ్యర్చ్య తస్మిన్నగ్నావేవ పురుషసూక్తేన వా ఉశన్తస్త్వాహవామహ ఇతి పితృసూక్తేన వా యత్తే కృష్ణ శ్శకున ఆతుతోద ఇతి మంత్రావృత్త్యా వా జుహుయా దిత్యేకే వదన్తి.

నిమిత్త శ్రాద్ధే హీనే ప్రాయశ్చిత్తమ్

నిమిత్త శ్రాద్ధే మాసేఽతీతే హీనేచ ప్రాజాపత్యం చరిత్వా ప్రాయశ్చిత్తం హుత్వా పూర్వవదేకోద్దిష్టం కుర్యాత్. ౬౩

నిమిత్త శ్రాద్ధే ఏకోద్దిష్ట శ్రాద్ధే మాసేఽతీతే హీనేచ తత్కర్తా ప్రాజాపత్యం చరిత్వా ప్రాయశ్చిత్తమితి ప్రేతకర్మణి సర్వత్ర తిలైరేవ వైశ్వదేవంయామ్యం పైతృకం వ్యాహృతీశ్చ ప్రాయశ్చిత్తమ్ హుత్వా పూర్వవదేకోద్దిష్టం కుర్యాత్. ఏవం ప్రతిమాసం ద్విగుణాది వృద్ధ్యా ప్రాయశ్చిత్తం కృత్వా సంవత్సరాన్తం

కుర్యాత్. నిమిత్త శ్రాద్ధే సంవత్సరేఽతీతే దహనాది సర్వం పూర్వవత్కర్తవ్యమితి సూత్రాభిప్రాయః.

**సపిణ్డీకరణాత్పూర్వం మాసి మాసి తన్మరణ దినే పిణ్డం నిరూప్యైకం భోజయతి.** ౬-౪

సపిండీకరణాత్పూర్వం ప్రతిదినం సోదకుంభ శ్రాద్ధమేక మేకం కృత్వా మాసి మాసి తన్మరణ దినే ఏకోద్దిష్ట వద్బ్రాహ్మణం వృత్వాఽభ్యర్చ్య పిండం నిరుప్య ఏకం బ్రాహ్మణం భోజయతి.

సంవత్సర మధ్యే సపిండీకరణ నిర్ణయః

**ద్వాదశే షష్ఠే తృతీయే వా మాసే శుభకార్యే ప్రాప్తే ద్వాదశాహే వా సపిండీకరణం కుర్యాత్.** ౬-౫

మరణకాలాదారభ్య ద్వాదశే మాసేవా షష్ఠే మాసే తృతీయేవా మాసే శుభకార్యే ప్రాప్తే నిషేకాదౌ శుభకర్మణ్యాగతే సతి ద్వాదశాహే సపిండీకరణం కర్తవ్యమ్. కుర్యాత్. తదా ఏకాదశేహన్యే వైకోద్దిష్టం కృత్వా స్నాత్వా దేశకాల శక్త్యపేక్షయాశ్వః సపిండీకరణం కర్తవ్యమ్. తస్మాత్తత్కాల విహితాన్యపి షష్ట్యధిక శతత్రయ మేకోద్దిష్ట శ్రాద్ధాని సోదకుంభాని సదక్షిణాకాని ప్రేత తృప్త్యర్థ మపకృష్యాద్య కరిష్యఇతి సంకల్ప్య బ్రాహ్మణేభ్య స్తావత్సంఖ్యాకాన్యా మదానానిదత్వా స్నాత్వా పునః గోత్రస్య శర్మణః ప్రేతస్య తృప్త్యర్థం తత్తత్కాల విహితాన్యపి షోడశైకోద్దిష్ట శ్రాద్ధాన్యపకృష్య అద్య కరిష్య ఇతి సంకల్ప్య ఏకోద్దిష్టవత్ షోడశ బ్రాహ్మణానామన్త్ర్య పూర్వవదభ్యర్చ్య షోడశైకోద్దిష్ట శ్రాద్ధాంగ పిండ ప్రదానం కరిష్య ఇతి సంకల్ప్య పూర్వవత్ పిండస్థానాది సర్వం కృత్వాన్నం షోడశధా విభజ్య పిండాన్ కృత్వాఽదాయ గోత్రాయ శర్మణే ప్రేతాయైతత్పిండ ముపతిష్ఠత్వితి క్రమేణైకస్మిన్ స్థానే షోడశ పిండాన్ దత్వా తాన్ భోజయేత్. ద్వాదశాహే సపిండీకరణం కుర్యాత్.

కేచిదధికమ్ :- పునర్మాసి మాసి త్రిపురుషోద్దేశేన ద్వాదశ శ్రాద్ధాని కుర్యాదిత్యేకే కేచిత్.

ఇతి సప్తమః ఖణ్డః

## అథాష్టమః ఖణ్డః

పూర్వేద్యుర్ద్వౌ విశ్వే దేవార్థం త్రీన్ పిత్రర్థ మేకం ప్రేతార్థం సపిండీకరణ శ్రాద్ధే భోక్ష్యతా మితి వరయిత్వా స్వాహా, స్వధా ఇతి తేషాం కరే తిలోదకం దత్వా పితృభ్య స్స్వధేతి పాత్రం తిలోదకైః పూరయిత్వా పితౄనావాహ్యే తన్నామ్నా ప్రేతాయ స్వధా ఇత్యన్యత్పాత్రం పూరయిత్వా ప్రేత మావాహ్య తథా హోమం హుత్వా పిణ్డం నిరూప్య విశ్వే దేవాభ్యాం ద్విర్ద్విర్దత్వా పితృభ్యః ప్రేతాయ సకృత్స కృద్దత్వా తాన్భోజయతి. ౧౧

ఇదానీం సపిణ్డీకరణ విధి మాహ. పూర్వేద్యుః సపిణ్డీకరణ దినాత్పూర్వస్మిన్ దివసే రాత్రౌ పూర్వోక్త లక్షణాన్ బ్రాహ్మణా నాహూయ ద్వౌబ్రాహ్మణౌ విశ్వే దేవార్థం సపిణ్డీకరణ శ్రాద్ధే భోక్ష్యతా మితి వృత్వా త్రీనితి పితా మహార్థం ప్రపితామహార్థం వృద్ధ ప్రపితా మహార్థ మేవం త్రీన్ బ్రాహ్మణాన్ పిత్రర్థం సపిండీకరణ శ్రాద్ధే భోక్ష్యతామితి వరయిత్వా ప్రేతస్య సపిండీకరణ శ్రాద్ధే భోక్ష్యతా మిత్యేకం బ్రాహ్మణం ప్రేతార్థమేకం విష్ణ్వర్థం సపిండీకరణ శ్రాద్ధే భోక్ష్యతా మితి ఫలైర్వరయిత్వా పరేద్యుః పూర్వవత్ ప్రక్షాళిత పాదాన్ బ్రాహ్మణానాసయిత్వాఽభ్యర్చ్య ప్రత్యేక మర్ఘ్యపాత్రం సంపాద్య స్వాహా స్వధేతి విశ్వేభ్యో దేవేభ్యః స్వాహేతి ప్రత్యేకం విశ్వేషాం దేవానాం కరే యవోదకం దత్వా పితృభ్యః పితామహేభ్యః ప్రపితామహేభ్యః స్వధేతి తేషాంకరే తిలోదకం దత్వా విష్ణవేస్వాహేతి విష్ణోః కరే యవోదకం దత్వా పూర్వవత్పిండస్థానం కృత్వోల్లేఖనాదీన్ కృత్వా సపవిత్రం పాత్రం నిధాయ పితృభ్యః స్వధేతి తత్పాత్రం తిలోదకైః పూరయిత్వాగోత్రాన్ రూపాన్ పితౄనా వాహయామీత్యేవం ఆమ ఆగచ్ఛన్త్వితి మన్త్రేణ సన్నమ్య పితౄన్ పితామహాన్ ప్రపితామహానావాహ్య తన్నామ్నేతి గోత్రాయ శర్మణే ప్రేతాయ స్వధే త్యన్యత్ప్రేత పిండ స్థానస్థం పాత్రం తిలోదకైః పూరయిత్వా తన్నామ్నా ప్రేతమావాహ్యాభ్యర్చ్య

యథా సపిండీకరణే పూర్వముక్తం తథాహోమం హుత్వా పిండం నిరుప్యేతి పితౄణాం ప్రేతస్య చ ప్రత్యేకం పిండం నిక్షిప్య పిశ్వేదేవాభ్యాం పాత్రయోః యథాభాగం హోమ శిష్టాన్నాదికం ద్విర్ద్విర్దత్వా ప్రక్షిప్య దేపశేషం పితృభ్యః పాత్రేషు సకృత్సకృద్దత్వా పూర్వవత్తాన్ బ్రాహ్మణాన్ భోజయతి.

పిండ సమారోపణం ఉదక సంయోజనం చ

**పితృపిణ్డైః ప్రేతపిండం సమారోప్య పితృపాత్రోదకైః ప్రేతపాత్రోదకం సంయోజయతి.** ౬౭

పితృపిణ్డైస్త్రిభిః క్రమేణ ప్రేతపిండం త్రిధా కృత్వా పూర్వవత్సమారోప్య పితృ పాత్రే ప్రేత పాత్రోదక మావాహన పాత్ర జలం సంయోజయతి.

సపిండీకరణే హీనే ప్రాయశ్చిత్తమ్

**సపిణ్డీకరణే హీనే కృతం శుభకార్యం వినశ్యతి.** ౬౮

సపిండీకరణే హీనే అకృతే సతి కృతం శుభకార్యం నిషేకాది శుభకర్మ వినశ్యతి. అశుభం భవతి.

**తస్మాత్ప్రాయశ్చిత్తం హుత్వా సపిండీకరణం కృత్వా భిన్నేఽహని విష్ణుసూక్తం మిన్ద్రాహుత్యా శ్రావితాది స్నాత్వా పునశ్శుభకర్మ కుర్యాత్.** ౬౯

తస్మాత్కారణాత్ కర్తా ప్రాజాపత్యం చరిత్వాఽగ్నిం సంసాధ్య వైశ్వదేవం యామ్యం పైతృకం వ్యాహృతీశ్చ తిలైః ప్రాయశ్చిత్తమ్ హుత్వా పూర్వవత్ సపిండీకరణం పిండ సంయోజనాన్తం కృత్వా భిన్నే హని పృథక్ శుభదినే తదగ్నిమాధాయ విష్ణోర్నుకాది ఖిన్ద్రాహుత్యా శ్రావితాదీన్ ఆజ్యేన ప్రాయశ్చిత్తం హుత్వా కృతమపి పునశ్శుభకర్మ కుర్యాత్.

**అష్టకా హీనే తద్వంశ వినాశో భవేత్.** ౭౦

సపిండీకరణ దినాద్ద్వితీయే తృతీయేవాహ్న్యష్టకా హీనే సతి తస్యకర్తుర్వంశః కులం తస్య వినాశోఽశుభం తద్వంశవినాశో భవేత్.

యత్నేనాష్టకాం కరోతి. ౭౧

తస్మాత్పూర్వప్రాయశ్చిత్తమ్ హుత్వా యత్నేన నియమేనాష్టకం కరోతి.

యథోక్త జలదాన పిణ్డ నిర్వాప బ్రాహ్మణ భోజనేషు శ్రద్ధయా కృతేషు సర్వసంపత్సమృద్ధి ర్వంశ వివర్ధనం చ భవేదితి విజ్ఞాయతే. ౭౨

శ్రాద్ధకర్తుః కిం ఫల మిత్యత ఆహ. యథోక్త ముక్తప్రకార మనతిక్రమ్య జలం తిలోదకాది తస్య దానం బలీనాం పిండానాం నిర్వాపో నిక్షేపః ఏకోద్దిష్ట శ్రాద్ధాద్యంగం బ్రాహ్మణభోజనం చ తేషు జలదాన పిండ నిర్వాప బ్రాహ్మణ భోజనేషు శ్రద్ధయా కృతేషు సత్సు తత్కర్తుః సర్వ సమ్పత్సమృద్ధి స్సకలైశ్వర్యాది వృద్ధిర్భవేత్. వంశ వివర్ధనం తత్కర్తుః కులాభివృద్ధిశ్చ భవేదితి విజ్ఞాయతే.

ఇత్యష్టమః ఖణ్డః

## అథ నవమః ఖణ్డః

విచ్ఛిన్నోపాసన కాలే మరణే ప్రాయశ్చిత్తమ్

గృహస్థ స్యోపాసనే విచ్ఛిన్నే యది ప్రాణోత్క్రాన్తి వృద్ధాను జ్ఞాత స్తత్పుత్ర శ్రోత్రియాగారా దగ్ని మాహృత్య సంస్కృతాయాం భువి వ్యాహృతీభిః సంస్థాప్యోపతిష్ఠేత. ౭౩

ఇదానీం ప్రేతాధాన మాహ. గృహస్థస్యేతి. ఆహితాగ్నే రనాహితాగ్నే గృహస్థస్య వనస్థస్యవా ఔపాసనే అగ్నిహోత్రాదికే హోమే విచ్ఛిన్నే నష్టేసతి యదిప్రాణానా మసూనా ముత్క్రాన్తిర్దేహాన్నిర్గమనం ప్రాణోత్క్రాన్తి స్తస్య మరణం భవేచ్చేత్ వృద్ధాః ప్రాయశ్చిత్తాదిజ్ఞాస వృద్ధా స్తైరనుజ్ఞాతో వృద్ధానుజ్ఞాతః అస్యేదం ప్రాయశ్చిత్తమ్ తదా చరే త్యనుజ్ఞా మధి గతవాన్ పుత్రాదిః పునరాధానోక్తం ప్రాయశ్చిత్తమ్ చరిత్వా తద్ద్రవ్యం బ్రాహ్మణేభ్యో దత్వా

అరణ్యాద్యారోపితం చేత్తద్ద్వివిధినా తం మథిత్వా నిదధ్యాత్. అథవా శ్రోత్రియాగారాదగ్నిమాహృత్య సంస్కృతాయాం ప్రోక్షణోల్లేఖనాది కృతాయాం భువి భూమ్యా మాహారం వినా వ్యాహృతీభిరగ్నిం సంస్థాప్య ఉపతిష్ఠేత.

"జుష్టోదమూనా" ఇత్యథైనం పరిసమూహ్య పరిస్తీర్య పర్యుక్ష్యాజ్యం విలాప్యోత్పూయ స్రుచి చతుర్గృహీతం గృహీత్వా సప్త వ్యాహృతీర్హుత్వా పునరపి పూర్వవద్గృహీత్వా పూర్వం దేవాః, ప్రాణాపానౌ ఇతి ద్వాభ్యాం మాత్వా వృక్షే సంబాధిష్టాం మాత్వా వృక్షే సంబాధేథాం ఇతి ద్వాభ్యాం అగ్నేఽభ్యావర్తిన్, అగ్నే అఙ్గిరః ఇతి ద్వాభ్యాం పునరూర్జా, సహరయ్యా ఇతి ద్వాభ్యాం అయాశ్చాగ్నే, బ్రాహ్మణ ఏకహోతా ఇతి ద్వాభ్యాం క్రమేణ చతుర్గృహీతాని హుత్వా పునశ్చతుర్గృహీతం గృహీత్వా మహావ్యాహృతీశ్చ జుహుయాత్. ౭౪

జుష్టో దమూనేత్యగ్నే రుపస్థానం కుర్యాత్. అథోపస్థానానన్తరం ఏనమగ్నిం పరిసమూహ్యేతి. పరితస్సమూహనం శోధనం పరిసమూహనం పాణినా పరిసమూహ్య దర్భైః దక్షిణ పశ్చిమాగ్రం పరిస్తీర్య పర్యుక్ష్యేతి పరిత ఉక్షణం సేచనం పర్యుక్షణం పరిషేచనంకృత్వా ఆజ్యం విలాప్యేతి ఆజ్యస్థాలీం గృహీత్వాగ్నావధిశ్రిత్య పవిత్రేణోత్పూయ దర్భోల్కేన ప్రత్యవతీర్య స్రుచి చతుష్కృత్వః ఆజ్యం గృహీత్వా చతుర్గృహీతం స్రుచ్యమాజ్యం గృహీత్వా సప్తకృత్వః సప్త వ్యాహృతీర్హుత్వా పునః పూర్వవచ్చతుర్గృహీతం గృహీత్వా ద్విః కృత్వః పూర్వం దేవాది ద్వాభ్యాం మన్త్రాభ్యాం హుత్వా పునశ్చతుర్గృహీతం గృహీత్వా ద్విః కృత్వః మాత్వా వృక్షమితి ద్వాభ్యాం మన్త్రాభ్యాం హుత్వా పునశ్చతుర్గృహీత్వా చతుష్కృత్వః అగ్నేభ్యావర్తిన్నిత్యాది చతుర్భిర్హుత్వా ఏవం క్రమేణ చతుర్గృహీతాన్యాజ్యాని హుత్వా పునశ్చతుర్గృహీతం స్రుచ్యమాజ్యం గృహీత్వా చతుష్కృత్వః మహావ్యాహృతీశ్చ హుత్వా సాయం పూర్వమగ్నిహోత్రాదికం హోమం జుహుయాత్.

ఏవ మగ్ని ముత్పాద్య పూర్వోక్తేన విధినా దహనం కుర్యాదిత్యాహ భగవాన్విఖనాః. ౭౫

ఏవ మగ్ని ముత్పాద్య పూర్వవదితి. తిస్రై ర్వైశ్వదేవం యామ్యం పైతృకం వ్యాహృతీశ్చ ప్రాయశ్చిత్తం హుత్వా తేనాగ్నినా పూర్వవత్ దహనం కుర్యాదితి విఖనాః ప్రాహ. ప్రాహేతి వీప్సా శారీరకర్మ పరిసమాప్తౌ భవేదితి.

ఇతి నవమః ఖణ్డః.

ఇతి శ్రీ వాజపేయ యాజీయే శ్రీ వైఖానస సూత్ర భాష్యే సప్తమ ప్రశ్నార్థ వివరణే చతుర్థః పటలః -

మాధవాచార్య పుత్రేణ నృసింహాగ్ని చితా కృతే
వాజపేయ కృతా భాష్యే ప్రశ్నోయం సప్తమోగతః

సప్తమః ప్రశ్నః సమాప్తః

# అథాష్టమః ప్రశ్నః

## అథ ప్రథమః ఖణ్డః

వర్ణాశ్రమ ధర్మాః

అథ వర్ణాశ్రమ ధర్మమ్. ౧

చతుర్ముఖ ముఖాంభోజ భృంగంతు విదుషాం పరమ్
మనసా శిరసా వాచా వన్దే విఖనసం మునిమ్.॥
స్మార్తం సర్వం ప్రభాష్యాథ రామం నత్వాఽహ మగ్నిచిత్.
తద్వర్ణాశ్రమ ధర్మస్య భాష్యం వక్ష్యామి సంప్రతి.॥

స్మార్తం నిషేకాది ప్రాయశ్చిత్త ముక్త్వా ఇదానీం తద్దృఢీ కరణార్థం తద్ధర్మమాహ. అథేతి. అథ శబ్ద ఆరంభార్థః. వర్ణాశ్రమ ధర్మమారభ్యత ఇతి వర్ణ ధర్మశ్చ ఆశ్రమ ధర్మశ్చ వర్ణాశ్రమ ధర్మశ్చ గుణధర్మశ్చ తద్వర్ణాశ్రమ
1 2 3 4

ధర్మం అష్టమే బ్రాహ్మణ ముపనయీ తేత్యాది వర్ణధర్మః/ సమిద్ధోమ భైక్ష చర్యాద్యాశ్రమ ధర్మః, బ్రాహ్మణస్య పాలాశోదండ ఇత్యాది వర్ణాశ్రమ ధర్మః, పాళుపాల్యాదయో గుణధర్మః, ప్రాయశ్చిత్తాదయో నిమిత్త ధర్మ ఇతి.

**బ్రాహ్మణ క్షత్రియ వైశ్య శూద్రా ముఖ బాహూరు పాదేషు జాతాశ్చత్వారో వర్ణా యస్మాద్బ్రాహ్మణో౽స్య ముఖమాసీ దిత్యాది శ్రుతిః.** ౨

తర్హి కేతే వర్ణాః కియన్త ఇత్యత ఆహ. బ్రహ్మణో పత్యం బ్రాహ్మణః క్షతాత్త్రాయత ఇతి క్షాత్ర స్తస్యా పత్యం క్షత్రియః, విశత్యా శ్రాదికమితి విట్ తస్యాపత్యం వైశ్యః, శుద్ధం దానేన రాతీతి శూద్రః, తే బ్రాహ్మణ క్షత్రియ వైశ్య శూద్రాః కుత్రజాతా ఇత్యత ఆహ. బ్రహ్మణః పరమాత్మనో విష్ణోః ముఖే జాతా బ్రాహ్మణాః, పరమాత్మనో బాహ్వోర్జాతాః క్షత్రియాః, పరమాత్మన ఊరోర్జాతా వైశ్యాః, పరమాత్మనః పాదయోర్జాతాః శూద్రాః ఇత్యేవం రీత్యా ముఖ బాహూరు పాదేషు జాతాః సంభూతాః చత్వారో వర్ణా భవన్తి. కపిలారుణ పీత కృష్ణ వర్ణైః వర్ణ్యన్తే నిరూప్యన్త ఇతి వర్ణాః అస్మిన్నర్థే శ్రుతిమాహ. బ్రాహ్మణో౽స్య ముఖమాసీదిత్యాది శబ్దేన బాహూ రాజన్యకృతః. ఊరూతదస్య యద్వైశ్యః, పద్భ్యాం శూద్రో అజాయతేతి శ్రుతిః. తస్మాన్ముఖాదిషు జాతాః.

**పూర్వేషాం త్రయాణాం నిషేకాద్యా స్సంస్కారా విధీయన్తే.** ౩

పూర్వేషాం ప్రథమానాం త్రయాణాం బ్రాహ్మణ క్షత్రియ వైశ్యానాం నిషేకాద్యాః సోమాన్తాః చత్వారింశత్సంస్కారా విధీయన్తే. ఉచ్యన్తే.

**తేషాం ద్విజన్మనాం వేదాధికారః** ౪

తేషాం త్రయాణాం ద్వితీయం జన్మ యేషాంతే ద్విజన్మానః తేషాం బ్రాహ్మణ క్షత్రియ వైశ్యానాం వేదాధికారో భవతి. వేదేషు వేదోక్త కర్మ స్వధికారః అనుష్ఠానార్హో వేదాధికారః.

**తస్మాద్బ్రాహ్మణస్యాధ్యయనాధ్యాపన యజన యాజన దాన ప్రతిగ్రహాః షట్కర్మాణి భవన్తి.** ౫

తస్మాత్కారణాత్ బ్రాహ్మణస్య అధీతే వేదపాఠనం కరోతీత్యధ్యయనం, అధ్యాపనం కారయతీత్య ధ్యాపనం, యజతి యాగం కరోతీతి యజనం, యాజయతి యాగం కారయతీతి యాజనం, దదాతి దానం కరోతీతి దానం, ప్రతిగృహ్ణాతి దానస్వీకరణం కరోతీతి ప్రతిగ్రహశ్చ ఏతే షట్ క్రియన్త ఇతి కర్మాణి తాన్యధ్యయనాధ్యాపన యజన యాజనదాన ప్రతిగ్రహాష్షట్కర్మాణి కర్తవ్యాని భవన్తి.

క్షత్రియ వైశ్యయోర్యజనాధ్యయన దానాని. ౬

క్షత్రియ వైశ్యయోర్వర్ణయోః యజనాధ్యయన దానాని త్రీణి కర్మాణి కర్తవ్యాని భవన్తి. నాన్యాని త్రీణి.

క్షత్రియస్య ప్రజాపాలన దుష్ట నిగ్రహ యుద్ధాశ్చ. ౭

ఇదానీం గుణధర్మాణ్యాహ. క్షత్రియస్య ప్రజాః జనాన్ పాలయతి రక్షతీతి ప్రజాపాలనం, దుష్టాన్ మనుష్యాన్ నిగృహ్ణాతి దండయతీతి దుష్ట నిగ్రహః, యుధ్యతే ప్రత్యర్థిభిరితి యుద్ధః తే ప్రజాపాలన దుష్టనిగ్రహ యుద్ధాశ్చత్రయః ఏతాని షట్కర్మాణి కర్తవ్యాని భవన్తి.

వైశ్యస్య పాశుపాల్య కుసీద వాణిజ్యాశ్చ. ౮

వైశ్యస్య పశూన్ పాలయతీతి పశుపాలనం తత్సంబంధికర్మ పాశుపాల్యం, కుత్సితేన వృద్ధ్యాదినా సీద్యతే వర్తత ఇతి కుసీదః, వణిజ్యతే వ్యవహ్రియతే సర్వమితి వణిక్ తత్సంబన్ధి కర్మ వాణిజ్యం ఏతే పాశుపాల్య కుసీద వాణిజ్యాశ్చ త్రయ ఏవ మేతాని షట్కర్మాణి భవన్తి.

శూద్రస్య ద్విజన్మనాం శుశ్రూషా కృషి శ్చైవ. ౯

శూద్రస్య ద్విజన్మనాం బ్రాహ్మణాదీనాం శుశ్రూషయతే సేవ్యత ఇతి శుశ్రూషా, కృష్యతే హలేన భూమిర్వి లిఖ్యత ఇతి కృషిః. చకారాత్పాశు పాల్యాదిశ్చ కర్మాణి భవన్తి.

బ్రాహ్మణస్యాశ్రమా శ్చత్వారః. ౧౦

సంప్రతి తేషాం ఆశ్రమా ఉచ్యన్తే. బ్రాహ్మణస్య ఆశ్రమ్యన్తి తపస్యన్త్యస్మిన్నిత్యాశ్రమాః. చత్వారో బ్రహ్మ చర్యాదయో భవన్తి.

క్షత్రియస్యాద్యాస్త్రయః. ౧౧

క్షత్రియస్య ఆద్యాశ్రమా స్త్రయః భవన్తి. న సన్న్యాసః.

వైశ్యస్య ద్వావేవ. ౧౨

వైశ్యస్య ద్వావే వాద్యావాశ్రమౌ భవతః, నవానప్రస్థ సన్యాసౌ.

ఆశ్రమ భేదాః

తదాశ్రమిణ శ్చత్వారో బ్రహ్మచారీ గృహస్థో వానప్రస్థో భిక్షు రితి. ౧౩

తర్హ్యే తేకిం నామాన ఇత్యత ఆహ. తే ఆశ్రమాయేషాం తే తదాశ్రమిణః చత్వారః, బ్రహ్మవేద స్తదధ్యయనం చరతీతి బ్రహ్మచారీ, గృహే తిష్ఠతీతి గృహస్థః వనే ప్రకర్షేణ తిష్ఠతీతి వనప్రస్థః, తేన వర్తమానో వానప్రస్థః, వనం ప్రస్థిత ఇతివా వానప్రస్థః, భిక్షతే అన్నం యాచత ఇతి భిక్షు రిత్యనేన ప్రకారేణ ఆశ్రమిణశ్చత్వారో భవన్తి.

ఇతి ప్రథమః ఖణ్డః

## అథ ద్వితీయః ఖణ్డః

ఉపనీతో బ్రహ్మచారీ మేఖలోప వీతాజిన దణ్డ ధారీ స్నాత్వా తర్పణం బ్రహ్మయజ్ఞం సాయం ప్రాత స్సన్ధ్యోపాసన సమిద్ధోమౌచ కుర్వన్ గురోః పాదా వుపసంగృహ్య నిత్యాభివన్ద్య వ్రతేనాధ్యయనం కరోతి. ౧౪

సంప్రతి బ్రహ్మచారిణో ధర్మ ముచ్యతే. ఉపనీతః పూర్వవత్కృతోపనయనః బ్రహ్మచారీ మేఖలా మౌంజీ రశనా, ఉపవీతం యజ్ఞ సూత్రం, అజినం, కృష్ణ మృగచర్మ, దండః పాలాశయష్టిః, ఏతేషాం ధారణ మస్యాస్తీతి మేఖలోపవీతా జిన దండధారీ భూత్వా పూర్వవత్స్నాత్వా తృప్యన్తి దేవర్షి పితరోజలాంజలి

భిరితి తర్పణం, బ్రహ్మణావేదేన దేవాన్ యజత ఇతి బ్రహ్మయజ్ఞస్తం సాయం ప్రాతః సంధ్యా ముపాస్యత ఇతి సంధ్యోపాసనం సమిద్భిః హోమః క్రియత ఇతి సమిద్ధోమః. తేచ చ స్సముచ్చయే. కుర్వన్ కుర్వాణః గురో రాచార్యస్య పాదౌ దక్షిణం దక్షిణేన, వామం పాదం వామేన పాణినా ఏవం పాదా వుప సంగృహ్య సంస్పృశ్య నిత్యమభివందితుం నమస్కర్తుం శీలమస్యేతి విత్యాభి వందీ భూత్వా ప్రాజాపత్యాది వేదవ్రతాన్యాచరన్ వ్రతేన నియమేనా ధ్యయనం కరోతి.

స్థితే గురౌ స్థేయాత్. ౧౫

వ్రత మేవాహ. గురౌ స్థితే సతి స్థేయాత్. స్వయం తిష్ఠేత్.

ఉత్థితే పూర్వముత్థాయ ప్రజన్త మనుగచ్ఛేత్. ౧౬

గురౌ వుత్థితే ఉత్తిష్ఠతి సతి పూర్వం తస్యోత్థానా త్ప్రాగేవ స్వయముత్థాయ వ్రజన్తం గచ్ఛన్తం గురుమనుగచ్ఛేత్. గురోః పశ్చాద్గచ్ఛేత్.

ఆసీనే శయానేచ నియుక్తో నీచై రన్వాసనశయనే కుర్యాత్

గురావాసీనేచ సతి గురౌ శయానేచ సతి నియుక్త స్తేనాను జ్ఞాతస్సన్ నీచై రనున్నత ఆసనే శయనేవా అన్వాసన మనుశయనంచ తేవాసన శయనే కుర్యాత్.

అనుక్తో యత్కించి త్కర్మ నాచరతి. ౧౮

అనుక్తం గురుణా ఇదం కుర్వితివ్య వియుక్తస్సన్ యత్కించిత్ కర్మ కిమపి కార్యం నాచరతి. నకుర్యాత్.

అనుక్తోపి స్వాధ్యాయ నిత్యకర్మాణ్యా చరేత్. ౧౯

అనుక్తోపి స్వయమేవ స్వాధ్యాయో వేదపఠనం నిత్యాని స్నాన సంధ్యో పాసన తర్పణ బ్రహ్మయజ్ఞ, సమిద్ధోమాదీని తానిచ కర్మాణి స్వాధ్యాయ నిత్య కర్మాణ్యా చరేత్.

ఉష్ణాంబు స్నాన దన్తధావన అంజనాను లేపన గన్ధ పుష్పో పాన చ్ఛత్రదివా స్వాపరేతస్కన్ద స్త్రీదర్శన స్పర్శన మైథు నాని కామక్రోధ లోభ మోహ మద మాత్సర్య హింసాదీని

**వర్జయిత్వా సదా శుశ్రూషుర్గురోః ప్రియహిత కర్మాణి కుర్వీత.** ౨౦

బ్రహ్మచారిణో౽నర్హాణి కర్మాణ్యాహ. ఉష్ణమగ్ని తప్తంచ తదంబు తేన స్నాన ముష్ణాంబు స్నానం వర్జయేత్. యది కుర్యాత్ పునః శీతాంబు స్నానేన శుద్ధ్యతి దంతానాం ధావనం కాష్ఠేన శోధనం దంతధావనం. అంజతే అనే నేత్యంజనం నేత్రకజ్జలం తస్యానులేపనం నేత్రయోర్ధారణ మంజనానులేపనం గంధో మలయజాది పరిమళద్రవ్యం పుష్పాణి కరవీర చంపకాదీని కుసుమాని ఉపానహ్యతే పాదావిత్యుపానత్ చర్మణా కృత పాదత్రాణం ఛత్రమాతపత్ర మేతాని చ వర్జయేత్. యది పరిగ్రహేత్ స్నానతః శుద్ధ్యేత్. యద్యుపాన చ్ఛత్ర ధారయేత్ ఇతి కేచిత్. దివా స్వాపం దివా నిద్రాంచ సదా విశేషతః పర్వణి వర్జయేత్. యది కుర్యాత్ స్నాత్వాష్ట శతం గాయత్రీం జపేత్. రేత స్స్కంద మింద్రియ స్ఖలనం కామతో౽కామతోవా వర్జయేత్. కామతశ్చేదవ కీర్ణ ప్రాయశ్చిత్తమ్ కుర్యాత్. యద్యకామతః స్నాత్వా శుద్ధ్యేత్. స్త్రీణాం రాగతో దర్శనం స్పర్శనం చ వర్జయేత్. యది కుర్యాత్ ప్రాజాపత్యం చరేత్. మైథు నం చ వర్జయేత్. యది కుర్యాత్ అబ్ధికృచ్ఛ్రం చరేత్. కామో విషయాభిలాషః క్రోధః కోపః, లోభః పిశునతా, మోహః ఆశా, మదో గర్వః, మత్సరస్యభావో మాత్సర్యమేతే అరిషడ్వర్గాశ్చ హింసా జీవహననం ఆదిశబ్దేన స్తేయానృత నిందాదయశ్చైతాని ఉష్ణాంబు స్నాన దంతధావనాంజనాను లేపన గంధ పుష్పో పాన చ్ఛత్ర దివాస్వప్న రేతస్స్కన్ద స్త్రీదర్శన స్పర్శన మైథునానిచ కామక్రోధ లోభ మోహ మదమాత్సర్య హింసాదీనిచ వర్జయిత్వా సదా శుశ్రూషాం కర్తు మిచ్ఛుః శుశ్రూషుస్సన్ గురోర్యాని ప్రియాణి హితానిచ కర్మాణి కార్యాణి తాని ప్రియహిత కర్మాణి కుర్వీత. ప్రియ మప్య హితం హితమప్య ప్రియం కార్యం న కుర్యాదిత్యర్థః.

**అద్వేషీ వాక్చిత్తానుకూలః ప్రియం సత్యం వదతి.** ౨౧

నాస్తి ద్వేష మస్యేత్య ద్వేషీ వాచో వచనస్య చిత్తస్య మనసోనుకూలం యస్య వాక్చిత్తానుకూలః సన్ యత్ప్రియం సత్యం తద్వచనం వదతి. ప్రియ మప్య సత్యం సత్యమప్యప్రియం నవదేదిత్యర్థః.

**ఆర్తోఽప్య సత్యాప్రియ నిన్దాం నాచక్షీత.** ౨౩

ఆర్తోపి క్షుత్తృష్ణాది పీడితోపి అసత్యం చాప్రియంచ నిందాంచ తామసత్యాప్రియ నిందాం నా చక్షీత. నవదేత్.

**మధు మాంస మత్స్య రసశుక్తా ద్యభోజ్య భోజనవర్జీ భైక్ష చరణం కృత్వా గురుణానుజ్ఞాతో భైక్షాన్న మశ్నీయాత్.**

మధు క్షౌద్రాది. మాంస మామిషం, మత్స్యం మీనంచ నాశ్నీయాత్. యది భుంజీయాత్ప్రాజాపత్యం చరిత్వా *మౌంజీ హోమేన శుద్ధ్యతి. రసోలవణాది శుక్తం ద్రవ్యాన్తరయుక్తం పర్యుషితం ఆదిశబ్దేన పర్యుషితోచ్ఛిష్ట కేశాది దూషిత సూతక ప్రేతకాద్యన్నాది భోక్తు మనర్హ మభోజ్య మేతేషాం భోజనం వర్జితుం శీలమస్యేతి మధు మత్స్యమాంస రస శుక్తాద్యభోజ్య భోజన వర్జీభవేత్. యది భుంజీయాత్. అహోరాత్ర ముపోష్య పంచగవ్యం పీత్వా శుద్ధ్యేత్. సూతక ప్రేతక నవశ్రాద్ధ సపిండీకరణ శ్రాద్ధ మాసికాద్యన్నం యది భుంజీయాత్ త్రిరాత్ర ముపోష్య పంచగవ్య పానేన శుద్ధ్యతీతి కేచిత్. భిక్షాణాం సమూహో భైక్షం తదర్థం చరణం గృహాద్గృహాదటనం భైక్షా చరణం మౌన వ్రతేనా నిందితానాం బ్రాహ్మణానాం గృహేభైక్షం కృత్వా తద్భైక్షం గురవే నివేద్య భుంక్ష్వేతి గురుణానుజ్ఞాతస్సన్ సాయం ప్రాతర్భిక్షాన్నం మౌనేన యథేష్ట మశ్నీయాత్. భుక్త్వా తదుచ్ఛిష్ట పాత్రాదిక మవటేపిదధ్యాదితి కేచిత్. యది భైక్ష చరణ మకృత్వా ఏకాహ మశ్నీయాత్ గాయత్ర్యష్టశతం జపేత్. యద్యపోశనం మౌనం చాకృత్వా అశ్నీయాదష్టోత్తర శతం గాయత్రీం జపేత్.

**గురు వృద్ధ దీక్షితానా మాఖ్యాం న బ్రూయాత్.** ౨౪

గురవః పితృ మాత్రాచార్యా వృద్ధాః జ్ఞానేన వయసా కర్మణా విద్యయా వృద్ధా అధికాః దీయతే జ్ఞానం క్షీయతే పాపమనయేతి దీక్షా తదస్యేతి దీక్షితః సోమయాజ్యాదయః తేషాం గురువృద్ధ దీక్షితానామాఖ్యా మభిధానం పూర్వనామ న బ్రూయన్నోచ్చరేత్.

**గుర్వభావే తత్పుత్రే చ గురువత్కర్మ చరతి.** ౨౫

---

* మౌంజీహోమం = పునరుపనయనం

గుర్వభావే ఆచార్యా సంభవే తత్పుత్రే ఆచార్యాత్మజే చకారాత్తద భావే తత్పౌత్ర ప్రపౌత్రాదికే శిష్యేవా గురవద్గురోరిప పూర్వోక్తం కర్మాచరతి.

ఇతి శ్రీ వాజపేయ యాజీయే శ్రీ వైఖానస సూత్ర భాష్యే అష్టమ ప్రశ్నార్ధ వివరణే ప్రథమః పటలః

ఇతి ద్వితీయః ఖణ్డః

## అథ తృతీయః ఖణ్డః

బ్రహ్మచారి భేదాః

**బ్రహ్మచారిణ శ్చతుర్విధాః.** ౨౬

తర్హ్యేత కియన్త ఇత్యత ఆహ. బ్రహ్మచారిణ శ్చతుర్విధాః.

**గాయత్రో బ్రాహ్మః ప్రాజాపత్యో నైష్ఠిక ఇతి.** ౨౭

గాయత్రీ మాత్ర మధ్యయన మస్యేతి గాయత్రః. బ్రహ్మ వేద మధీయతేఽనేనేతి బ్రాహ్మః ప్రజాపతి ర్నారాయణో దేవతా అస్య ధ్యేయత్వేనేతి ప్రాజాపత్యః. నిష్ఠా బ్రహ్మచర్యమేవ నియమోఽస్యేతి నైష్ఠికః. ఇతి చతుర్విధా భవన్తి.

గాయత్రః

**గాయత్ర ఉపనయనా దూర్ధ్వం త్రిరాత్ర మక్షారలవణాశీ గాయత్రీ మధీత్యా సావిత్ర వ్రత సమాప్తేరత్ర వ్రతచారీ.**

ఇదానీ యేతేషా మాచార మాహ. గాయత్ర ఇతి నామా బ్రహ్మచారీ ఉపనయనా దూర్ధ్వ ముపనయనకాలాదుపరి త్రిస్రశ్చ రాత్ర్య స్త త్రిరాత్రం త్రిదినం, సంఖ్యాపూర్వో ద్విగుః ద్విగురేకవచనం, క్షారం మరీచ్యాది, లవణం సాముద్రాది నవిద్యతే తాభ్యాం మిశ్రితం భోజన మస్యే త్యక్షారలవణాశీ భూత్వా గాయత్రీ మధీత్య గురోరధ్యయనం కృత్వా ఆసావిత్ర వ్రత సమాప్తేః సావిత్ర వ్రత విసర్జన పర్యన్తం అత్ర త్రిదిన వ్రత మక్షారలవణాశనం తదా చరితుం శీలమస్యేతి వ్రతచారీ భవేత్.

బ్రాహ్మః

బ్రాహ్మః సావిత్ర వ్రతా దూర్ధ్వ మనభిశస్తా పతితానాం గృహస్థానాం గృహేషు భైక్షా చరణం వేదవ్రత చరణం చ కృత్వా ద్వాదశసమా వింశతి సమావా గురుకులే స్థిత్వా వేదాన్వేదౌ వేదంవా సూత్ర సహిత మధ్యయనం కృత్వా గార్హస్థ్యానుసరణం కుర్యాత్. ౨౯

బ్రాహ్మ ఇతినామా బ్రహ్మచారీ సావిత్ర వ్రతా దూర్ధ్వం సావిత్రవ్రత విసర్జనాదుపరి ఆసమావర్తనా దనభిశస్తాః అనారోపిత పాతకా అనిందితాశ్చతే అపతితా అకృత పాపాశ్చ తేషా మనభిశస్తా పతితానాం గృహస్థానాం బ్రాహ్మణానాం గృహేషు భైక్ష చరణం సాయం ప్రాతర్భిక్షాటనం కృత్వా తన్నివేదితాన్నం భుక్త్వా వేదవ్రతానాం ప్రాజాపత్యాదీనాం చరణం తత్తత్కాండాధ్యయనారంభ కాలే బన్ధనం తత్త దన్తే విసర్జన మేవం వేదవ్రతాచరణం కృత్వా ద్వాదశసమా ఉపనయనాదూర్ధ్వం ద్వాదశ సంవత్సరావా వింశతి సమా వింశతి వత్సరావా కాలాధ్వనోరత్యన్త సంయోగ ఇతి ద్వితీయా. ప్రతి వేదం ద్వాదశ సంవత్సరానితి* (కేచిత్ స్వీకరణాన్తం వా ద్వాదశ వర్షాణ్యే తద్వేదే బ్రహ్మచర్యం చరేత్ తత్ప్రతి ద్వాదశవా సర్వేషు గ్రహణాన్తం వేతి) వా వేద స్వీకరణాన్తం వేతి గౌతమవచనాత్ గురోః కులం వంశః తస్మిన్ గురుకులే స్థిత్వా వేదాన్ ఋగ్యజుస్సామాఖ్యాన్ త్రీన్ వేదాన్ ద్వౌ ఋగ్యజుషీ వేదమృగ్వేదం స్వసూత్రం యద్వేదమూలం తద్వేద మపివా సూత్ర సహిత మధ్యయనం కృత్వా గార్హస్థ్యానుసరణం గృహస్థస్య భావో గార్హస్థ్యం దదనుసరతి తన్మార్గం గచ్ఛతీతి గార్హస్థ్యానుసరణం కుర్యాత్. సమావృత్తస్సన్ దారసంగ్రహణం కుర్యాదిత్యర్థః.

ప్రాజాపత్యః

ప్రాజాపత్యస్స్నాత్వా నిత్యకర్మ బ్రహ్మచర్యశీలో నారా

* "క" పుస్తకే.

యణ పరాయణో వేద వేదాఙ్గార్థాన్విచార్య దారసంగ్రహ
ణం కరోతి. ౩౦

ప్రాజాపత్య ఇతి నామా బ్రహ్మచారీ స్నాత్వా సమావృత్తో భూత్వా నిత్య కర్మసు స్నాన సంధ్యోపాసనాదిషు బ్రహ్మచర్యేచ శీలం తాత్పర్యం యస్య స నిత్యకర్మ బ్రహ్మచర్య శీలః నారాయణ పరాయణస్సన్ వేదాశ్చత్వార స్త్రియో వా వేదాంగాని శిక్షా వ్యాకరణ ఛందో నిరుక్తాదీని మన్వాది స్మృతయోవా మీమాంసాదయో వా తాన్ వేదవేదాంగాన్ విచార్య అర్థతోఽవగమ్య పశ్చాత్ దార సంగ్రహణం వివాహం కరోతి.

ప్రాజాపత్యే త్రిసంవత్సరాదూర్ధ్వం న తిష్ఠే దిత్యృషయో
వదన్తి. ౩౧

ప్రాజాపత్యే బ్రహ్మచర్యాశ్రమే త్రిసంవత్సరాదూర్ధ్వం సమావర్తన కాలాదారభ్య త్రిసంవత్సరాదుపరి కాలే నతిష్ఠేదితి ఋషయోవదన్తి. స్వదారనిరతో ఋతుకాలాభి గామీ సదా పరదారవర్జీ సప్రాజాపత్య ఇతికేచిత్.

నైష్ఠికః

నైష్ఠికః కాషాయం ధాతువస్త్రమజినం వల్కలం వా పరిధాయ జటీశిఖీ వా మేఖలీ దణ్డీ సూత్రాజినధారీ బ్రహ్మచారీ శుచిరక్షారలవణాశీ యావదాత్మనో విప్రయోగ స్తావద్గురుకులే స్థిత్వా నివేదిత భైక్ష భోజీ భవతి. ౩౨

నైష్ఠికో నామ బ్రహ్మచారీ కాషాయం రక్తమృదాప్లుత వస్త్రం ధాతునాగైరికేణ రక్తవర్ణేనాన్యేనవా హారితక్యాది రసేనవా ప్లుతం వసనం ధాతువస్త్రమథవా కాషాయం నామ ధాతువస్త్రం వా, అజినం కృష్ణాజినంవా, వల్కలం తరుత్వగ్వస్త్రం వా పరిధాయ జటా అస్యేతి జటీ, శిఖా అస్యేతి శిఖీవా, మేఖలా అస్యేతి మేఖలీ, పాలాశో దండోఽస్యేతి దండీ, సూత్రాజిన యోర్ధారణమస్యేతి సూత్రాజినధారీ, బ్రహ్మచారీ జితేంద్రియః శుచిః శుద్ధాత్మా అక్షారలవణాశీ క్షార లవణ వర్జ్యాన్న భోజీ భూత్వా యావత్కాలే నాత్మనః ప్రాణస్య విప్రయోగో

నాశః స్యాత్ తావత్కాల పర్యంతం గురుకుల ఇతి గుర్వభావే తద్భార్యాయాం తత్పుత్రే తత్పౌత్రే తత్ప్రపౌత్రే తత్ జ్ఞాతౌ సబ్రహ్మచారిణి వా ఏవం గురుకులే స్థిత్వా పూర్వవత్ భిక్షాటనం కృత్వా తద్భైక్షం గురవే నివేద్య తే నానుజ్ఞాతో భూత్వా నివేదితం చ తద్భైక్షం భోక్తుం శీలమస్యేతి నివేదిత భైక్ష భోజీ భవతి.

ఇతి తృతీయః ఖణ్డః

## అథ చతుర్థః ఖణ్డః

గృహస్థ ధర్మాః

**దారాన్ సంగృహ్య గృహస్థోపి స్నానాది నియమాచారో నిత్య మౌపాసనం హుత్వా పాకయజ్ఞ యాజీ వైశ్వదేవ హోమాన్తే గృహాగతం గురుం స్నాతకంచ ప్రత్యుత్థాయాభివన్ద్యాసన పాద్యాచమనాని ప్రదాయ మధునా తోయేనవా ఘృత దధి క్షీర మిశ్రం మధుపర్కం దత్వాన్నాద్యైర్యథాశక్తి భోజయతి.** ౩౩

ఇదానీం గృహస్థ ధర్మ మాహ. దారాన్ సంగృహ్యేతి. సవర్ణా మనన్య పూర్వా మసమానర్షి గోత్రజాతాం (చతుర్థం) పితృత స్సప్తమా దూర్ధ్వం మాతృతః పంచమాదూర్ధ్వ మేవం విచార్య కన్యాం వివాహయేత్. గృహస్థ స్సదృశీం భార్యాం విందే తానన్య పూర్వికామ్. అరోగిణీం భ్రాతృమతీ మసపిండా యవీయసీమ్.* అసమాన ప్రవరై ర్వివాహః. ఊర్ధ్వం సప్తమాత్పితృ బంధుభ్యః బీజినశ్చ మాతృబంధుభ్యః పంచమాదితి గౌతమ సూత్రే నిర్దిష్టత్వాత్. ఏవం దారానాత్మ భార్యాం సంగృహ్య పాణిగ్రహణం కృత్వా గృహస్థోపి నిత్యం స్నాన మాదిర్యేషాం సంధ్యోపాసన తర్పణ జప బ్రహ్మయజ్ఞాదీనాం తన్నియమేనాతి ప్రయత్నేనాచరతి కరోతీతి స్నానాది నియమాచారస్సన్

* యవీయసీ = యౌవనురాలు

నిత్యం ప్రతిదినం పూర్వవదౌపాసన హోమం హుత్వా పాకయజ్ఞైః స్థాలీపాకా
దిభిః యష్టుం శీలమస్యేతి పాకయజ్ఞయాజీ భూత్వా పూర్వవద్వైశ్వ దేవహోమం
కృత్వాన్తే వైశ్వదేవ హోమాన్తే గృహాగతం స్వగృహ మభ్యాగతం గురు
మిత్యాచార్యం జ్ఞానవృద్ధం వయోవృద్ధం విద్యావృద్ధం కర్మశ్రేష్ఠమాచార్యా
న్వయ వేదశాస్త్రి నిపుణం యోగినం పితరం మాతరం వా గురూన్ స్నాతకం
కృతసమావర్తనం ప్రాజాపత్యాఖ్యం బ్రహ్మచారిణం చ గృహాగతం ప్రత్యు
ద్గాయ ఆసనాద్యుద్ధితో భూత్వాఽభివన్ద్య యథోచిత మాసమ్యాసన పాద్యాచమనాని
ప్రదాయేతి. ఇదమాసనమితి పీఠం దర్భాసనంవా దత్వా తత్రోపవిష్టస్య ఇదం
పాద్యమితి పాదయోర్జలం సంస్రావ్య ఆపః పాదావస్మిన్ కుల ఇతి మన్త్రా
భ్యాం పాదౌ ప్రక్షాళయేత్. సధౌత పాదో విరాజ ఇతి స్వహస్తేన తద్ధస్తం
పరిమృజ్య తేనాత్మనో హృదయ మభిమృశతి. ఇదమాచమన మిత్యాచమనం
దత్వా మయితేజ ఇత్యర్ఘ్యం దదాతి. ఏవమాసన పాద్యాచమనాని ప్రదాయ
మధునా క్షౌద్రేణ, తదభావే తోయేన, జలేనవా, ఘృత దధి క్షీరాణి సమభాగం
గృహీత్వా మిశ్రీకృత్య తత్ ఘృత దధి క్షీరమిశ్రం మధునా పృచ్యతే యుజ్యత
ఇతి మధుపర్కం చ యన్మధునో మనవ్యమితి దత్వా అన్నాద్యైరిత్యాది శబ్దేన
యథా సంభవైః శాకమూలఫలాదిభిః వా యథాశక్తి యథా తృప్తి భోజయతి.

## భిక్షూన్బ్రహ్మచారిణోతిథీ న్వేదవిద శ్రోత్రియా న్పితృ వ్యాచార్య ర్త్విజ్మాతుల శ్వశురాదీ నభ్యాగతా న్బాల వృద్ధా ననాథార్తా ధ్వ శ్రాన్తాంశ్చ యథార్హం పూజయతి.

ఏవం గృహాగతాన్ భిక్షూన్ కుటీచకాదీన్ యతీన్ బ్రహ్మచారిణో బ్రాహ్మణా
దీన్ వేదాభ్యాసరతాన్ అతిథీన్ నవిద్యతే తిథిర్యేషాం తానతిథీన్ బ్రాహ్మణాద్యాన్
వేదవిదః వేదార్థజ్ఞాన్ శ్రోత్రియాన్ శ్రుతవృత్త సంపన్నాన్ పితృవ్యః పితృ
భ్రాతా ఆచార్యో నిషేకాదికృత్ ఋత్విగధ్వర్యు ప్రముఖ ఆత్మయజ్ఞ యాజకః
మాతులః మాతుర్భ్రాతా, శ్వశురో భార్యాజనకః ఆదిశబ్దేన తత్పుత్రాదయో
బాన్ధవాశ్చ తాన్ పితృవ్యాచార్యర్త్విజ్మాతుల శ్వశురాదీనశనార్థం గృహం ప్రత్యా
గతాన్ బ్రాహ్మణాది బాలాన్తరుణవయసః వృద్ధాః అపరవయసః తాన్ బాలవృద్ధాన్
నవిద్యతే నాథః స్వామీ అన్నప్రదః వా యేషాం తాననాథాన్ ఆర్తాః క్షుత్పిపా

సాద పీడితాః అధ్వశ్రాన్తాః పథిశ్రాన్తాః తాన్ అనాథార్తా ధ్వశ్రాన్తాంశ్చ చకారస్సర్వత్ర సంబధ్యతే. యథార్హం యథోచితం పూజయతి. యస్య యస్య యద్యత్పూజార్హం తస్య తస్య తథాసన పాద్యాదినా పూజయేదిత్యర్థః.

అశక్తోప్యగ్రం భిక్షాం వా సోదకం దత్త్వా శేషం భుఞ్జీత దయా సత్యశౌచాచారయుత, స్స్వాధ్యాయ తర్పణాభ్యా మృషీన్యజ్ఞ బలిహోమ జలపుష్పా ద్యై ర్దేవాన్, శ్రాద్ధై పుత్రైశ్చ పితౄన్బలినా భూతా నన్నా ద్యైర్మనుష్యాం శ్చ నిత్యమర్చయేత్. ౩౫

ఏవం కర్తుమశక్తోపి దరిద్రోపి అగ్రం శరావపూర్ణమన్నం దదాతి. తదప్యభావే భిక్షాం పాణిపరిమితమన్నం వా సోదకమితి పూర్వం తద్ధస్తే జలం ప్రదాయ తతోగ్రం భిక్షాంవా దత్త్వా పునర్హస్తోదకం దద్యాత్. ఏవం సోదకం దత్త్వా శేష మన్నం స్వయంపోషితవర్గై స్సహ భుంజీత. దయా కృపా సత్యం తథ్యం శౌచం శుచిత్వ మాచారస్స్నాన సంధ్యోపాసనాద్యనుష్ఠానం తైర్యుతోఽన్వితః దయాసత్య శౌచాచారయుతః సన్ స్వాధ్యాయో వేదాధ్యయనం అధ్యాపనం బ్రహ్మయజ్ఞంచ తర్పణం కూపాస్యాభ్యః స్వాహేతి దత్త జలాంజలిః తాభ్యాం స్వాధ్యాయ తర్పణాభ్యా మృషీన్ విశ్వామిత్రాదీన్ నిత్యమర్చయేత్. యజ్ఞో బ్రాహ్మయజ్ఞాగ్నిష్టోమాది బలిర్వైశ్వదేవకాలే దత్తాన్నబలిః హోమో నిత్య హోమాదిః జలం దేవార్చనకాలే పాద్యార్ఘ్యమర్పిత ముదకం, తథా పుష్పాణిచ ఆదిశబ్దేన ధూపదీపాదయశ్చ ఏతైర్యజ్ఞ బలిహోమ జలపుష్పాద్యైః దేవాన్ విష్ణుప్రభృతీన్, ఇష్టాన్ దేవాన్ నిత్యమర్చయేత్. శ్రాద్ధై రష్టకాద్యైః పుత్రైర్యథా విధి సంభూత సుతైశ్చ పితౄన్ వస్వాదీనర్చయేత్. బలినా వైశ్వదేవకాలే దత్తబలినా భూతాన్ నక్తంచరాదీన్ దేవయోనీనర్చయేత్. అన్నాద్యైర్మనుష్యాన్ వైశ్వదేవకాలే గృహాగతాన్ అతిథీ నభ్యాగతాన్వా బ్రాహ్మణాదీన్వా యథాశక్తి భోజనాదినా నిత్యమర్చయేత్. ఏవమృషిదేవ పితృభూత మనుష్యాన్ బ్రహ్మ యజ్ఞాదిభిః క్రమేణ నిత్యమర్చయేత్.

**ఋణత్రయైః ముక్తోఽనృణో భవతి.** ३६

ఋణత్రయైః ఋషిదేవ పైతృకైః త్రిభిః ఋణైర్ముక్త స్త్యక్తః సన్ న విద్యతే ఋణాన్యస్యే త్యనృణో భవతి. తథా చ శ్రుతిః. బ్రహ్మచర్యేన ఋషిభ్యో యజ్ఞేన దేవేభ్యః ప్రజయా పితృభ్య ఇత్యాది.

ఇతి చతుర్థః ఖణ్డః

## అథ పంచమః ఖణ్డః

గృహస్థ భేదాః

**గృహస్థా శ్చతుర్విధాః** ३७

తర్హ్యేతే కిం నామానః కియన్తః కీదృశ ఇత్యత ఆహ. గృహస్థా శ్చతుర్విధా ఇతి- చాతుర్విధ్యమేవాహ.

**వార్తావృత్తి శ్శాలీనవృత్తి ర్యాయావరో ఘోరాచారిక శ్చేతి.**

వార్తా వ్యర్థా వృత్తిర్వ ర్తనం యస్య వార్తా వృత్తిః శాలీనం శాలి సంబంధి శుభావృత్తిః యద్వా శాలీనా శ్రేష్ఠా వృత్తిర్యస్య సశాలీనవృత్తిః యాయావరో యాజ్ఞావృత్తిః ఘోరమాచారమస్యేతి ఘోరాచారికః చేతి సముచ్చయే. ఇత్యనేన ప్రకారేణ గృహస్థా శ్చతుర్విధా భవన్తి.

వార్తా వృత్తిః

**వార్తా వృత్తిః కృషి గోరక్ష్య వాణిజ్యోప జీవీ.** ३८

సంప్రత్యే తేషాం విశేషధర్మ మాహ. తత్ర ప్రథమో యథేత్యత ఆహ. వార్తా వృత్తిర్నామ గృహస్థః కృషిరితి. ప్రాతస్స్నాత్వా సన్ధ్యావన్దనాదికం సమాప్య స్థిరాంగం 1నీరుజం తృప్తం 2సునర్దం షండవర్జిత మనడ్వాహద్వయం హలేన సంయోజ్య ఘటికా చతుష్టయం కర్షయిత్వా తావున్ముచ్య పునరేతద్విధ మనడుహద్వయమాయోజ్య చతస్రో ఘటికాః కర్షయిత్వా తావున్ముచ్య పునరన్యౌ

---

1 నీరుజం = 2 సునర్దం =

